సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 48
సంచిక 31
6-4-55

మన్మథ చైత్ర శుద్ధ చతుర్దశి బుధవారం



గోళవలయాలు

ఫోటో: ఎస్. కామేశ్వరరావు, రాజమండ్రి

# బారిష్టరు గారి బాతాఖానీ

ముక్కపాటి నరసింహశాస్త్రి

సంవత్సరాదినాడు సాయంకాలం, కులాసాగా తోటలో కూచున్నాం. ఉదాత్తమైన విందు, దానిపైన, మూడు గంటలకు లఘువుగా ఫలహారం, దీని మార్గం, సుగమం చెయ్యడానికి, కాఫ్యాదిపానీయాలతో మాటల కెక్కడా ఖాళీ లేకుండా పోయింది - మాటకన్నమాటేమిటి! ఆ మాటకొస్తే ఊహాలకే కాళీ లేదు లోపల ఒక విధమైన తృప్తితో, అవ్యక్త ఆనందంతో, ఆ క్షణంలో, రాగ ద్వేష రహితులమై, నింగి పై దృష్టినిల్పి, రమణాశ్రమంలో, రమణమహర్షి శిష్యులలాగా, దేనికోసమో ఎదురుచూస్తున్నట్లు కూచున్నాం, మాటామంచీ లేకుండాను.

మా టప్పయ్య ముఖంలో తాండవించే ఆనందం వర్ణనాతీతం. 'ఏం టప్పయ్యా! నూత్న వసంతశోభ అంతా నీ ముఖంలోనే ప్రతిఫలిస్తోంది' అన్నాను. టప్పయ్య లోపలినుంచి పొంగి వస్తున్న ఆనందాన్ని ఆపుకోలేక ఒక చిన్ననవ్వు నవ్వి, 'అది కాదు మేష్టారూ,' ఈ ఋతువులూ ఈ మార్పులూ అవీ చూస్తుంటే, తలుచుకుంటే చాలా చిత్రంగా ఉందిసార్. ఏదో, అంతా అగో ఇదిగా ఉందండి అందుచేతను, ఇవాళ ఏమిటో ఎలాగో ఉండి, అలా అలా గాలిలో తేలిపోతున్నట్టున్నదండి. అదుగో చూచారా, కోకిల కూతకూడా వినపడుతోంది. ఓరి దీనిఇల్లు బంగారంకానూ! నిన్నటదాకా లేనిది హఠాత్తుగా ఎక్కడినుంచి వచ్చిందంటారు మేష్టారూ ఈకోకిల. హఠాత్తుగా అనుకోకుండా రైలు దిగి వచ్చినచుట్టంలాగ' అన్నాడు టప్పయ్య చిన్న పిల్లవాడిలాగ.

'మరేం లేదు టప్పయ్యా' భయపడకు. ఏమీ కంగారు అవసరంలేదు. తగ్గిపోతుంది. ఇదేం దీర్ఘవ్యాధికాదు. నామాట నమ్మ ఊరికే, ఇవాళ కొంచెం మేత ఎక్కువై అజీర్తి చేసింది. ఆ గాలిలో తేలిపోతున్నట్లుండటం దాని లక్షణం. లేకపోతే, ఏటొచ్చీ - అంతమాట నమ్మలేనుకాని - నాలో, నిద్రాణంగా నాకుకాని మాకుకాని, ఎన్నడూ కానరాని కవితాశక్తి - కట్టతెంచుకు బయటపడబోతోందో ఏమో. ఏం చెప్పగలం' అన్నాడు శాస్త్రి.

'వాడిబొంద! వాడికి కవిత్వం ఏమిటి శాస్త్రీ. వాడికే కవిత్వంవస్తే నేను సన్యసిస్తాను' అన్నాడు భద్రం -

'పూర్ణిమా, అమావాస్యలు దగ్గర పడడంతోనే ఉన్మాదులకు ఉద్రేకం ఎక్కువ అవుతుందంటారు. అలాగే వసంతాగమం వయసువారందరికీ కామోద్రేకం కలిగిస్తుందంటారు అలాటి ప్రమాదమేమీ సంభవించడం లేదుకదా టప్పయ్యా. చెప్పు వెంటనే. దానికితగ్గ నివారణోపాయాలు, శాస్త్రంలో చెప్పినవో చెప్పనివో చేసి చూతాం' అన్నాడు శర్మ

'ఏడిశాడు. వాడికి కవిత్వమూ కాదు. కామమూ కాదు వాడు వట్టి కుర్రకుంక కాదండీ. ఇప్పుడిప్పుడే కళ్లుతెరుస్తున్నాడు. అందుకని అంతా వింతగా కనుపిస్తుంది వాడికి' అన్నాడు రామం

పాపం వాడు లోకువగా దొరికాడనా. వాడే అన్నమాటేమిటి - అందరికీ వింతగానే కనుపిస్తుంది. శివశివా అని శివరాత్రితో చలి పారిపోవడం, చన్నీళ్లస్నాన ముసందపేక్ష కలగడం, పగలు చెట్లనీడలనూ, రాత్రులు ఆరుబైటనూ నిద్రపోవలెననే వాంఛ కలగడం, మనకు సోకే ప్రతివాయుతరంగం, ఏదో పుష్పసుగంధపరిమళ భారంగా ఉండడం, కోకలస్వరములు వినపడడం, ఏతీగ, ఏ చెట్టు చూచినా నూతనవస్త్రధారణ చేసినట్లు, కొత్త చిగురుటాకులు తొడిగి, పుష్పించడం, చూస్తుంటే, ఆలోచిస్తుంటే చిత్రంగా కనుపించదూ!

మనదేశంలో ఇంకా అంత ఎక్కువగా స్పష్టంగా కనుపించదా ఋతువులమార్పు. శీతలదేశాల్లో మరీ స్పష్టంగా కనుపిస్తుంది. మనకు ఆరుఋతువులు కాని వాళ్ళకు అనా పాశ్చాత్యులకు నాలుగే. వాళ్ళకు ఉండి శీతాకాలంతో ప్రారంభమవుతుంది మంచు దట్టంగా పడుతో ఉంటుంది. చలి గజగజలాడిస్తూ ఉంటుంది. ప్రకృతి మంచుతో తెల్లగా ఉంటుంది. చెర చిన్నచిన్న ప్రవాహాలు గడ్డకట్టుకుపో చెట్లూ, చామలూ, ఒక్క ఆ లేకుండా మోడుగా, నిర్జీవంగా కనపడతాయి. వసంతం ప్రవేశి అనగా April ఒకటి వచ్చి

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : ఆలిండియా పిక్చర్సువారి "సీతారా"లో వైజయంతీమాల


| | |
|---|---|
| బారిష్టరుగారి బాతాఖానీ— | 2 |
| కాంబోడియా కబుర్లు— | 4 |
| సమస్య తీరింది— | 6 |
| అపస్వరాలు (సీరియల్)— | 12 |
| భయం— | 17 |
| వనితాలోకం— | 22 |
| బొమ్మరిల్లు— | 35 |
| తెలివైన కుక్క— | 36 |
| జూదరి— | 38 |
| తగినశాస్తి— | 43 |
| నిజమైనపాలకుడు — | 45 |
| విజ్ఞానవీథులు— | 46 |
| సినిమా— | 50 |



పెనగొండ (పెగడా) మీద రాతితో మలిచిన ఆదిశేషువులు



నాంపెన్ రాచనగరు (గుళికాకారంలో ఉన్న గోపురం కాంబోడియా ప్రత్యేకత)

వటువు దీనికి ఎదరగానూ, అతని ప్రక్కన తల్లిదండ్రులూ కూచుంటారు. బుద్ధప్రవచనాలూ, నాగపూజా ఆహ్వానపూయి లాంటి వన్నీ జరుగుతాయి. "ఆచార్యు"డు నల్లటి చెరుకుగడ ఒకటి తీసుకుని, దాని చివరనున్న ఆకులు అన్నీ ఒకదాన్తో ఒకటి మెలిపెట్టి ముడతాడు. దానితో నాలుగు దిక్కులూ చూపిస్తూ, ఏవో మంత్రాలు చదువుతాడు. చివరన, ఈ చెరుకాకులే ఉపయోగించి వటువుతల్లికి నల్లగా "కప్పు" వేస్తాడు. ఇప్పుడిప్పుడీ కప్పు వేసుకునే ఆచారం నామమాత్రంగానే మిగిలిపోయింది. తరవాత అన్నం కొబ్బరికాయలో పెట్టి నాగులకి నైవేద్యం పెడతారు. చివరని తీర్థ కాల్లో ముంచిన తోరం కడతారు, వటువుచేతికి. అయితే ఈతంతులో తోటిపెళ్ళి కొడుకు లాగ కొంతమంది వటువుచుట్టూ ఉంటారు. వీళ్ళు కొవ్వొత్తి దీపాల హారతితో వాడి చుట్టూ పంధొమ్మిది సార్లు ప్రదక్షిణం చేస్తేనేగాని యీకర్మకాండ పూర్తి కాదు. ఓసారి కొవ్వొత్తులు ఆర్పేసి, వాటిమసితో చేసిన కాటిక పెడతారు. చివరన.

మర్నాడు యీవటువు బంధుమిత్రపరివారంతో పెగోడాకి వెళతారు. మహారాజ కుటుంబంలో పుట్టిన బుద్ధుడికి ఎంతో ఆడంబర పరిస్థితులు ఉండేవిగనక (బుద్ధుడు కాకముందు) యీవటువుకికూడా పెగోడాకి వెళ్ళేసమయములో బంధుమిత్రులంతా యెంతో ఆడంబరంగా,దర్జాగా ఏర్పాటు చేస్తారు. ఉన్నతోద్యోగుల యిళ్లల్లోనూ, రాచకుటుంబాల్లోనూ అయితే యీ సమయంలో ఎంతో గొప్పగా ఊరేగి, కోట చుట్టూనూ అందులో ఉన్న సిల్వర్ పెగోడా చుట్టూనూ ప్రదక్షిణాలు చేస్తారు.

బాజాలూ (ముఖ్యంగాడోలు), వెండి వస్తువులూ, కాషాయవస్త్రాలూ, భిక్షాపాత్రా, చిత్రంగా అలంకరించిన కొవ్వొత్తి స్టాండ్లూ ముందునడుస్తూ, అటూ యిటూ యిద్దరు ఛత్రచామరాలు పడుతూఉంటే తను గుర్రంఎక్కి ఊరేగుతాడు వటువు. పెగోడా గుమ్మందగ్గర ఓబఫ్ఫూన్ (*Buffoon*) ఉంటాడు. వాడు మన్మథుట్ట! లోగడ బుద్ధుడి మనస్థైర్యం పాడుచేద్దాంఅని తలపెట్టేట్ట! వీడు కాస్త వటువుని అడ్డగించి సన్యసించవొద్దని, అతని మనోనిశ్చయం పాడుచెయ్యడానికి చూస్తాడు. కాని వటువు కృతనిశ్చయుడు కనక, గుర్రందిగి, కాలుభూమిమీదపెట్టి, గంభీరంగా ప్రవేసిస్తాడు మఠం. అక్కడ లోపల గుడి చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేస్తాడు. కొంతమంది ఆసందర్భంలో ఏవో మంత్రాలుచదువుతారంటారు కాని, సాధారణంగా శుభం భూయాత్ లాంటిది ఏదో ఒక్క ముక్క అని చాలించేస్తారు.

ఇహను, ఆతరవాత యీ వటువుఅక్కడి కొవ్వొత్తిదీపాలూ ఊదొత్తులూవెలిగించి, బుద్ధవిగ్రహానికి సాష్టాంగనమస్కారం చేస్తాడు. భిక్షాపాత్ర, కాషాయవస్త్రాలూ ముందుంచుకొని ఆసీనుడవుతాడు. అనేకులు ఒక్కసారిగా యివవుతే, వాళ్ళు వాళ్ళయీడు వారీగా కూచోవాలి. తరవాత ఆ పెగోడాతాలూకు ప్రధాన భిక్షువు వొచ్చి వీళ్ల భుజాల మీదుగా కాషాయ వస్త్రాలు కప్పుతాడు. తరవాత ఏవోకొన్ని బోధలుచేసి, ఓమూలగా పోయి కాషాయ వస్త్రాలు ధరించమంటాడు వీళ్ళని. అవి వేసుకువొచ్చి వీళ్ల ప్రధాన భిక్షువుకి నమస్కరిస్తే అతను మతబోధచేసి భిక్షాపాత్ర ప్రసాదిస్తాడు. అక్కణ్ణించీ "భవతి భిక్షాందేహి!" ★

(ఇంకావుంది)

# సమస్యా తీరింది

"విశ్వేశ్వరా సుకుమార్ ?" అన్నాడు, కళ్ళజోడు పైనించి అతన్ని చూస్తూ, లోపల ప్రవేశిస్తున్న ఒక ముసలాయన

అంతవరకు కిటికీలో కూచుని, వొదుల్తున్న సిగరెట్ పొగలోంచి, నీలాకాశాన్ని చూస్తూ, స్వాప్నిక్ జగత్తుల్లో ఊహావిమానాలపైపయనిస్తున్న సుకుమార్ ఉలిక్కిపడిలేచి, సిగరెట్ ఆర్పి పారేసి, "రండిసార్! నమస్తే. నా పేరే!" అన్నాడు

ఆయన నిలబడలేనన్నట్టుగా ఈజీఛైర్ ని ఆక్రమించేడు.

సుకుమార్ నుంచునే వున్నాడు.

"కూచోండి. మీతో ఒక అర్జంట్ విషయం మాట్లాడదామని వొచ్చాను. కొంచెం సావకాశంగా వినాలి" అన్నాడాయన, ఒక పాడిదగ్గు దగ్గి.

ఏమీ అర్థంకాక సుకుమార్ శక్తిహీనుడిలా కూచున్నాడు "చెప్పండి" అంటూ.

"ఆఁ! ఏంలేదు మా అమ్మాయి మొన్న ఆంధ్రా మెట్రిక్ కు కట్టింది కాని కట్టుదిట్టంలేని మూలాన పాస్ కాలేదు. మీరు కొంచెం దయుంచి, తప్పక మా ప్రార్థన అంగీకరించి, రెండునెల్లు కష్టపడి ప్రైవేట్ చెప్పినట్టయితే, మీరుణాన్ని ఎప్పటికీ తీర్చుకోలేని వాళ్లమవుతాం మీకష్టానికితగిన ప్రతిఫలం ఇయ్యడానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు ముసలాయన.

సుకుమార్ హృదయం తేలికపడింది ఇదివరకు ఆయన్ను చాలా సార్లు రోడ్ మీద చూశాడు. కాని ఎదో అనుమానంతో తన వైపు చూస్తున్నట్టుగా తోచి మనస్సులో చాలా బాధ పడ్డాడు. తర్వాత ఆయన చూపుల్ని తప్పించుకునే తిరిగేవాడు. అలాంటివ్యక్తి తన గదికి రాడంతో, మొదట మనస్సుని ఎదో ఆందోళన పీడించసాగింది. ఇపుడది నివృత్తి అయింది.

సుకుమార్ వెంటనే అన్నాడు: "మీకు తెలీదనుకుంటాను, ట్యూషన్లు చెప్పే అలవాటు నాకులేదని. చాతనైనంత వరకూ స్కూల్లోనే చెబుతాను, అంతే! నన్ను క్షమించండి!!"

ముసలాయన వొదల దల్చుకోలేదు: "ఆ విషయం తెల్సి వొచ్చాను ప్రత్యేకం డబ్బుకోసం కక్కుర్తిపడే వాళ్లెప్పుడూ సరిగా చెప్పనే చెప్పరు. రెండు వందల రూపాయలవరకూ ఇవ్వగలను. మీరు తప్పక శ్రమపడాలి" అన్నాడు.

రెండువందలు! సుకుమార్ నోట్లో జలదరించింది. ఎన్ని కాప్టన్ సిగరెట్ల పాకెట్లు వొస్తాయి! పట్నంవెళ్లి ఎన్ని సినిమాలు చూడవచ్చు! వెధవనియమాలు! అంతడబ్బు వొస్తుంటే వాటిని వొదులుకుంటే నేం?

అప్పటికీ "మరేమీ లేదండీ! నాకు అలవాటులేదు ఫలితానికి గారంటీ ఇవ్వలేను. అందుకే ఆలోచిస్తున్నాను" అనిసణిగాడు.

"దానికి మీ రేంచేస్తారు?" అని సమాధాన మిచ్చాడు ఆముసలాయన.

"ఐనా, సాయంత్రంవొచ్చి సరీక్షు చేస్తాను. అప్పుడుగాని ఏమాటా చెప్పలేను" అని కొసిరాడు సుకుమార్.

## శొంఠి కృష్ణమూర్తి

ఆయన "థాంక్సు! తప్పకరండి" అని వెళ్లాడు.

## 2

ఆ పట్నంలో సుకుమార్ ని ఎరగని వాళ్లెవరూ వుండరు. ఉన్నత పాఠశాలలోని వుపాధ్యాయు లందరిలోను చిన్నవాడూ తెలివైనవాడూ కావడమేకాక, సర్వవిధాలైన లలితకళలకు ఆలవాలమైన ఆనగరంలో సుకుమార్ పాల్గొనని నాటక ప్రదర్శనంగాని, సాహిత్య సభలుగాని, త్యాగరాజ మహోత్సవాలుగాని వుండవు. ఈకళాప్రియత్వముకూడా అతనికి ప్రజాసన్నిహితత్వంకొని తెచ్చింది. అందుకే అతన్నెరగని వారులేరు.

అంతేకాదు! రెండువందల రూపాయలు తెచ్చుకునే అవివాహితుడు ఊళ్లో వుండడం పెళ్లికాని పంతులమ్మలకు, పెళ్లి ఈడు కొచ్చిన విద్యార్థినులకూ కూడా ప్రత్యేకాకర్షణ అవడంలో ఆశ్చర్యం ఏమీ లేదనుకుంటాను.

ముసలాయన వెళ్లాక సుకుమార్ కు ఎన్నాలోచనలు కలిగాయి:

తానసలు ఆడపిల్లలకి చదువుచెప్పగలడా? మొగవాళ్లయితేనయానో్ భయానో్ చెప్పవచ్చును! కాని విద్యార్థినులతో ఎలా! ఆ అమ్మాయెలా వుంటుందో? ఎలాంటిదో? ఛా! ఎలాంటిదైతే తన కెందుకు! తన పని తను సరిగా చేసుకుంటే చాలు.

'ప్యాసవడానికి మీరెలా గ్యారంటీ ఇస్తారు?' అన్నాడుగాని, నిజంగా అలా అనిపిస్తుందా? ప్యాసే కాకపోతే నతకెంత అవమానం?

చివరికి 'నే నేంచేస్తానూ నాశక్తివిధి నెర వేరుస్తాను. తర్వాత ఏమవుతేనాకేం?' అనుకున్నాడు.

ఆలోచనల్తో కాలం రెక్కలు కట్టుకుని పారిపోయింది

సాయంత్రం రానే వొచ్చింది; సుకుమార్ వాళ్ళింటికి వెళ్ళనూ వెళ్లాడు.

ముసలాయన చాలా ఆదరించి హాల్లోకి తీసుకువెళ్లాడు.

అక్కడ చాలా కుర్చీలున్నాయి కిటికీలకూ ద్వారాలకూ అద్దకం వెయ్యబడిన వాయిల్ తెరలు కట్టబడ్డాయి గోడలని రకరకాల కాలండర్లు అలంకరించి వున్నాయి సుకుమార్ కు ఆయింటినీ, ఆనవనాగరిక పు ఏర్పాటుల్నీ చూడగానే వొళ్లు పులకరించింది.

"అదృష్టవంతులు" అనుకున్నాడు ఆశ్చర్యంగా కళ్లని పెద్దవిచేసుకు చూస్తూ ఫలహారంచేస్తున్నంతసేపూ, ముసలాయన సుకుమార్ తన కోరికను మన్నించినందుకు సంతోషించినట్టున్నాడు మనసులో. అదే పనిగా అతన్ని పొగడసాగాడు.

"మీ సంగతి మావాళ్లకు కూడా చెప్పాను. వాళ్లెంతో ఆనందించారు మా అమ్మాయి చదువుకుంటే మీదగ్గరే చదవాలన్నారు!" అన్నాడు నవ్వుతూ.

సుకుమార్ టీ తాగడం పూర్తిచేసి, చేతిరుమాలుతో మూతి తుడుచుకున్నాడు

తమలపాకు లిచ్చినతర్వాత ఆవృద్ధుడు "భారతీ, భారతీ! పుస్తకాలు తీసుకొని, రా అమ్మా" అని కేకేశాడు

"వస్తున్నా నాన్నా!" అంది సన్నని ఓ కంఠం లోపలినుండి

కంఠం తియ్యగానే వున్నట్టనిపించింది, అతనికి. అతను సస్పెన్సు భరించలేకపోయేడు. త్వరగా వొస్తే బాగుండు ననుకున్నాడు

మరుక్షణంలో చాలా అందంగా, నాజూగ్గా, సన్నగా, పొడుగ్గా వుండి; లేత ఆకు పచ్చనిచీరతో శరీరాన్నంతని కప్పుకుని, పుస్తకాలతో వొ[illegible]

---

భారతి అతని హృదయాన్ని రంజింపచేసింది.

భారతి టేబిల్ పై పుస్తకాలుంచి ఎదుట కుర్చీమీద తల వొంచుకుని కూర్చుంది.

ముసలాయన బయట గుమ్మందగ్గర, బయటగా కుర్చీ వేసుకున్నాడు.

"ఏం బిడియపడక పంతులుగారు చెప్పిందంతా బాగా నేర్చుకో. అన్నిటికి సరిగా సమాధానం చెబుతూండు" అని వెళ్లి, కుర్చీలో శరీరాన్ని చేర్చి దినపత్రికా పఠనంలో నిమగ్నుడయ్యాడు.

"నువ్వు ఏయే సబ్జెక్టుల్లో వీక్‌గా వున్నావు?" అన్నాడు సుకుమార్.

"ఇంగ్లీష్, సైన్సు, లెక్కలు" అంది భారతి

ఇంగ్లీషు పుస్తకం తీసుకొని కొంత డిక్టేషనూ, ఒకటి రెండు ప్రశ్నలూ, ఒక లెక్కా, సైన్సులో కొన్ని ప్రశ్నలూ ఇచ్చాడు భారతి తోచిన జవాబులు తల ఎత్తకుండానే రాసింది. తప్పులు ఎక్కువ లేవు

# ★ సమస్య తీరింది ★

సుకుమార్‌కు ఆ సుకుమారికి చదువు చెప్పడం సులువే ననిపించింది.

అతని బడిలో విద్యార్థులు అతని మనో పథంలో మెరిశారు. ప్రతీ క్లాసుకీ పది పదిహేను మందిని తప్పిస్తే, చదువుమీద శ్రద్ధవున్నవాళ్ళే కనపడరు. అంతకంటె ఈ అమ్మాయి స్టాండర్డు చాలా బాగున్నట్టనిపించింది

టెస్టు చెయ్యడం అయ్యాక, "ఈ వేళకి చాలు" అని లేచాడు. భారతి కూడా లేచింది.

ముసలాయన "ఏం పరీక్ష చేశారా?" అన్నాడు, అతన్ని కూచోమంటూనే

"ఆఁ ఫరవాలేదండీ మరి శ్రమపడి చెబుతాను. మీ అమ్మాయికూడా కష్టపడి చదవాలి. ఆపైన దేవుడిదే భారం" అన్నాడు సుకుమార్ దేవుణ్ణి ముందుగానే, రాబోయే ఫలితానికి అడ్డుగా పెట్టుకోవడం ఎందుకైనా మంచిదనుకుని.

"అంతేలెండి నేడే ప్రారంభం అనుకోండి — ఈ వేళ మంచిరోజు కూడా! మీకు వీలున్నప్పుడు వచ్చి, చెప్పి వెడుతూండండి" అన్నాడు.

సుకుమార్ సెలవు తీసుకున్నాడు

ఇంటికి వొచ్చాడన్నమాటే గాని అతని మనసు మనసులో లేదు. తీయని ఆలోచనల్లో మెదడు ఆనందపరవశమవసాగింది

భారతి! పేరు ఎంతచక్కగావుంది?

ప్రైవేటు చెప్పడమంటె — అన్నాకూ ఆముదం తాగడంతో సమానమనుకున్న అతనికి ఏమీ కష్టమనిపించలేదు.

'సంస్కారం గల కుటుంబం' అనుకోసాగాడు; 'ఇంకా మూడునెల్లు గడవాలి! అప్పుడే వెర్రి మొర్రి ఆలోచనలకి పోతే ఎలాగ?'

అన్నిటికంటె ఆశ్చర్యం కలిగించిన దతనికి, ఎదురుగా కిటికీ తెరమాటున 'సిల్హౌట్'లా కదలినవ్యక్తే! ఎవరబ్బా! మధ్య మధ్య ముసిముసి నవ్వులూ, నిట్టూర్పులూకూడా వినపడేవి.

తనమీద నిఘా కాదుకద! నిఘా ఐతే నవ్వెందుకు?

రక రకాల ఆలోచనలూ — అవి అంతులేనివి

హోటలు కెళ్ళే టప్పటికి ఎనిమిదిన్నరై, చల్లరిఅన్నం సాక్షాత్కరించినా అతను గమనించనే లేదు.

మసాలా పాన్ బిడా వేసి, సిగరెట్ ముట్టించి ఇంటికి చేరాడు.

## 3

రోజులు గడవసాగాయి. చదువూ ముందుకు వేస్తోనేవుంది.

మేష్టర్‌గా భారతిమీద కొంత అధికార స్వరం ఉపయోగించసాగాడు.

అప్పుడప్పుడు ఇంగ్లీషులో తప్పులు పోయినా, లెక్కలు రాకపోయినా, సైన్సులో పటాలు దించడం చేతకాకపోయినా నవ్వించడం, ఏడిపించడం మొదలైనవి మొదలెట్టాడు

భారతి చాలా గడుసు ఘటం! ఎప్పుడూ తలెత్తిఅయినా చూసేదికాదు; చూసినా చూసినట్టు కనపడేదికాదు; అందులో అతను గమనించేలా అసలే చూడలేదు.

అది తెల్సుకున్న అతను ఏగోడవైపో, ఎదటి బాదం చెట్టువైపో చూస్తో పాఠాలు చెప్పేవాడు; 'నేలవైపుకాదు పుస్తకాన్ని చూడు', అని మందలించేవాడు; ఏదోవిధంగా భారతి దృక్కుల్ని ఆకర్షించాలని ప్రయత్నించేవాడు.

* * *

ఓరోజున లెక్కలురాక భారతి బాధపడుతుంటే కేకలేశాడు. కిటికీ తెరమాటున ఫక్కున నవ్వు వినవచ్చింది. ఓమారు మొహం తెరపైన కన్పడింది.

అతను ఆనందం పట్టలేకపోయాడు. తన హృదయానికి గేలం వేస్తున్నది ఒకరు కాదు; ఇద్దరూ.

భారతి లోపలికి వెళ్ళి తల్లితో ఫిర్యాదు చేసినట్టుంది ఆ కిటికీదగ్గర నీడ నవ్వు మానింది

* * *

తను నెల్లాళ్ళుగా పాఠాలు చెబుతున్న భారతిలో చలనం లేకపోవడం చూసి 'శిలా హృదయం గావును' అనుకున్నాడు.

కాని ఆ వేళ బాటనీలో తెలియని పాఠమేదైనా అడుగుతుంటే పుష్పము పాఠము తీసింది

ఆపాఠం మగవిద్యార్థులకి చెప్పడానికే వింతగా వుంటుంది. ఇంక తనేమిచెప్ప గలడు?

ఐతేనేం? చదువూ తప్పుతుందా? నిర్భయంగా పుష్పంఅంశాలన్నీ చెప్పుకుపోయాడు.

ఆ ముసలాయన బయట కుర్చీలోనే ఐనా జంకలేదు రెండురోజుల తర్వాత ఎక్కడో కాఫీ తాగుతుంటే అతనికి స్ఫురణకు వచ్చింది — నిజంగా పాఠం అర్థంకాక కాదు; తననోటిద్వారా విందామని అడిగిందేమోనని.

అప్పుడప్పుడు తన స్వంత పుస్తకాలు కొన్ని చదువుకోడాని కిచ్చేవాడు. మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు చక్కని న్యూస్ పేపర్ అట్టలతో తిరిగి వచ్చేవి.

ఒకసారి అడిగాడు:

"ఇవన్నీ ఎవరేశారు?"

"మా అక్కయ్య"

"ఆవిడ ఎంతవరకు చదువుకున్నారు.?"

"హెచ్. యస్. సి పాసైంది"

అతనడుగుతే సమాధానాలు బాగా నే చెప్పేది కాని ఏమడుగుతాడు — పాఠాల్ని విడిచి ఏమన్నా మాట్లాడాలని వుండేది. పాఠాల ప్రశ్నలడిగితే నోటిని చెప్పేది కాదు — రాసి చూపించేది. అదీగాక ముందూ, వెనకా ఇద్దరు సెంట్రీలు.

ఆ వేళ తను భారతికిచ్చిన ఇంగ్లీషు స్టోరీ బోయున్న పుస్తకాన్ని తీసుకువెళ్ళాడు. దానికూడా అట్ట అమర్చివుంది చాలా సంతోషించాడు

దానిమీద 'భారతి' అని రాసివుంది. స్కూల్లో టీచర్లు మాస్తే బాగుండదని కవరు తీసేశాడు? దానిలోనుండి ఓచీటి కిందపడింది దాన్ని తీశాడు.

"నన్ను గురించి మా చెల్లెలెందుకు అడగడం?

అహల్య"

అనివుంది.

భారతి అక్కయ్య అహల్యా? ఎంత అందమైన పేరు! పేరేకాకండా అహల్య మీద అతని కమితమైన ప్రేమ — ఎందుకంటే భర్తరాయైపొమ్మని శపిస్తే ఎంగాక — ప్రేమవిలువని గ్రహించిన ప్రేమమూర్తి!

ఇది బాగుండదనుకొని తానూ సమాధానానికి పుస్తకపు అట్టని పోష్టుమాన్ గా వాడసాగాడు

మరో నెల గడిచే టప్పటికి ఉత్తరాల పోగు తయారైంది — ప్రేమలేఖలు!

పాపం భారతికివేం తెలీవు! తెలిస్తే కథా గమనానికి అడ్డు తగిలేదేమో?

క్రమంగా సుకుమార్‌కి భారతి మీద ఆకర్షణపోయింది తెరవెనకాల, నీలి నీడపై అతనిదృష్టి. ఆముసిముసి నవ్వుల్లో కోకిలనినదాన్ని వినేవాడు; ఆ నిట్టూర్పు శబ్దాల్లో విరహ వేదని వినేవాడు.

తరచు ఏదోవంకని అతనికి కనపడసాగింది అహల్య; పెన్‌ఫ్రెండ్‌షిప్ అధికమయ్యాక

అతను చిరునవ్వు విసిరేవాడు. అహల్య చూపులో గ్రహించేది.

ఈగొడవల్లో బడిలో పదిసార్లుచేసిన లెక్కలైనా ఆన్సర్లు కలిసేవికావు. భారతి 'మేషరుకే లెక్కలురావు' అని ఎక్కడ అనుకుంటుందోనని భయపడేవాడు తిరిగి మనస్సుని కేంద్రీకరించి అరగంట కష్టపడితే నేగాని ఆ లెక్కలు వొచ్చియేడిచేవి కావు.

## 4

ఒకరోజున వర్షం జోరుగా వొచ్చి పాఠాన్ని చెదరగొట్టింది

ముసలాయన లోపలికి వొచ్చాడు. బాతాఖానీలో 'పెళ్ళిళ్ళ సమస్యలూ నేటి యువత

కుల సంకుచితత్వంబుగులూ; తను విలువని తెల్సుకోకుండా ఆంధ్రదేశపుతల్లిదండ్రుల్ని పీడించాలని చూసేవారి నైజమూ! అన్నీ అముసలాయన లెక్చరులో దొర్లేయి !

సుకుమార్ ఆయనకు ఆత్మసంతృప్తి కలిగేలా "అవునండి, నిజమే. నేటి నవయువకులు అభ్యుదయం, అభ్యుదయం అంటూ భుజాలెగరేస్తూ, వెనక్కు అడుగేస్తున్నారు" అన్నాడు.

తర్వాత ఆయన తన బాధంతా వెళ్లడించాడు: నాలుగైదువేలు కట్నమిస్తామన్నా మంచి సంబంధాలు కుదరడం లేదనీ. అంతా

సుకుమార్ 'ఊఁ!' కొట్టివూరుకున్నాడు 'నువ్వు చేసుకుంటున్నావా?! అని ఆయనా అడగలేదు; 'నావంటివాళ్లు మీకు కనపడరేం ?' అని ఇతను అనలేదు.

మనస్సులోమాత్రం అనుకున్నాడు, అహల్య తన హృదయాధిదేవతైద్దు బాగుండునని కాని తనంత తనువెళ్ళి ఎలా అడుగుతాడు. ? మగాడు ? పౌరుషం అంతే తగిలింది.

"ప్రయత్నం చెయ్యండి — మీకు దొరక్కపోవడమేమిటి యత్నిస్తే" అన్నాడు ఉపసంహారంగా.

## 5

ఒకనాటిరాత్రి .. ......

నక్షత్రాలు నవ్వలేదు, ఆకాశం పూలవర్షం కురిపించలేదు; ఖగోళాలు ప్రేమసంగీతాన్ని ప్రసరించలేదు; చంద్రుడు నవ్వులో తన సహస్ర హస్తాలతో భూదేవికి కితకితలు పెట్టలేదు.

ఐనా ఎందుకో సుకుమార్‌కు తీరని సంతోషం కలుగసాగింది పైవన్నీ జరిగినట్టేఅనిపించింది

మేఘాల్లో తేలుతూ, గంధర్వలోకంలోకో పోతున్నట్టు అనుకోసాగాడు. తనలో తనే నవ్వుకోసాగాడు.

అర్ధశేరు మిఠాయికొని మిత్రులందరికీ పంచిపెట్టాడు. ఏమిటీ కారణం ?

—ఏమీ లేదు

"రేపురాత్రి ప్రభాకర్ హాలువద్ద మొదటిఆట అనంతరంకలవండి

ఎక్కడికన్నా పోదాం. మీరుమీ లేఖలో రాసినటు నాకూ మీ ప్రేమకావాలి. అన్యమైన కోరికేదీలేదు

ఇదే ఆఖరి సందేశం

మీ అహల్య"

లెక్కలపుస్తకం అట్టలోంచి బయటపడింది.

ప్రేమలేఖల పర్యవసానమిది.

## 6

సుకుమార్ ఆత్రుతలో స్త్రీల గేటుదగ్గర కాచుకుతున్నాడు సినిమా వొదిలాక భార్యల సంరక్షణా దీక్షాపరతంత్రులైన భర్తలూ, తక్కిన స్త్రీల చుట్టపక్కాలు అక్కడ చేరారు.

రిక్షా టాంగావాలాలగోల మధ్య వుండనేవుంది.

"ఇటురండి" సన్నని గొంతుతో సుకుమార్‌ని పిలిచింది. అతను అనుసరించాడు.

జనాన్నిదాటాక "స్టేషన్‌కు పోదాం" అన్నాడు.

"సరే" అని తలూపింది అహల్య. ఇద్దరూ నడుచుకుని స్టేషన్‌కు వెళ్లారు. సుకుమార్ "రైలుటైం ఇంకా ఎంతవుం'దని అడిగాడు.

"రెండు గంటలు" అన్నాడు నిశాచరుడైన గుమాస్తా.

పొడుగాటి ప్లాట్‌ఫారంపైన మూలగా చీకటిలోనున్న సిమెంట్ బెంచీవైపు వెళ్ళి కూచున్నారు ఇద్దరూ.

ఆ నక్షత్రాల వెలుగులో, పరోక్షంగా స్టేషన్‌నుండి వచ్చి పడుతున్న దీపపుకాంతిలో ఇద్దరూ అనిర్వచనీయమైన ప్రేమ భావంలో మునిగి తన్మయత్వం పొందసాగారు.

తనచేతిలోనికి అహల్య వేళ్లని తీసుకున్నాడు, నిప్పుకణికల్లా వుండి బెండకాయలనిపోలిన వేళ్లు అతనికి వెచ్చదనాన్ని కలిగించడమేకాకండా, శరీరంలోనికి విద్యుత్తును పంపినట్టుకూడా అనుకున్నాడు

చలిగాలికి ఆగలేక చీరకొంగుతో తల కప్పుకుని, తక్కినదాన్ని కండువాలా కప్పుకుంది, అహల్య

వాళ్లు పరస్పరం మాసుకోవడంతప్ప మాటలేమీ జరగడంలేదు; ఎవరు విషయాన్ని ఎలా మొదలెట్టాలా ? అనేది తేలనేలేదు.

భవిష్యత్ కార్యక్రమమంతా ఆనాటిలేఖలోనే వ్రాశాడు సుకుమార్. మర్నాటికి హైదరాబాద్ చేరాలి. అక్కడే అతని మిత్రులూ, బంధువులూ చాలా మంది వున్నారు. వాళ్లు ఎలాగా అతనికి సహాయం చేస్తారు. అక్కడవాళ్ల సహాయంతోనే పెళ్లి ఏర్పాటు.........

"ఏం భయంగావుందా ?"

"భయమెందుకు ?"

"వొంటరిగా పరాయి......"

"ప్రియుడు పరాయివాడెందుకౌతాడు?"

"ఎంత నమ్మకం ! "

"అవును; ఆడవాళ్లబతుకే అంత!"

"ఎంత? "

"నమ్మి ప్రేమించిన వాడికోసం సర్వం త్యాగం చేసేంత—అంతే; అంతకంటె గత్యంతరం ఏముందీ? "

"నిజమే—పురుషులకంటె స్త్రీలేగొప్ప ప్రేమికులేమో అనుకుంటాను"

"స్త్రీలూ అలాగే అనుకుంటారు"

"ఏమని ?"

"పురుషులు గొప్పప్రేమికులని !"

"మీ నాన్నకి తెలుస్తే?"

"భయంలేదు"

"ఎందుకని ?"

# రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు**

**ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి రంగుల చిత్రాలు స్వీకరించబడవు

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

పండుగలు
పర్వదినాలు
ఇతర అన్ని వేళల

తుషార్
విటమిన్‌లుగల
వనస్పతి



తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్., కర్నూలు
పరిశుభ్రించేయబడిన తుషార్ నూనెకూడా లభ్యం కాగలదు

# ★ సమస్య తీరింది ★

"ఆయనకో కోరేది నా వివాహమే కనక. పైపెచ్చు సంతోషిస్తారు"

"నాకు నమ్మకంలేదు"

అహల్యదగ్గరగా జరిగాడు, ఒకచెయ్యి ఆవిడ నడుంచుట్టూపోనిస్తూ-అహల్యవొంటి చేతి కౌగిట్లోనే ఇరుక్కుంది

అహల్య దగ్గరకు జరిగింది ఇద్దరూ జీవితంలో తొలిసారిగా కొత్త అనుభూతులు పొందుతున్నట్టున్నారు — మైమరచిపోయారు.

"చలి వేస్తోందా ?"

"లేదు"

"ఏమో; మీరసలేసుకుమారులుకూడాను"

సుకుమార్ నవ్వేడు! అహల్యముత్యాల పల్వరస చీకట్లో మెరిసింది

రైలు బైలుదేరినట్టుంది ముదటిగంట మ్రోగింది. దీపాలు వెలిగించారు! జనం హడావుడి, పోర్టర్లగోలా తిరిగి విజృంభింపసాగింది.

"మీ వుద్యోగానికేమన్నా... "

"ఏం భయంలేదు. నెల్లాళ్ళు సెలవు పెడితే వాళ్ళే ట్రాన్స్ఫర్ చేస్తారు—మరో వూరు"

అహల్యతో చెప్పివెళ్ళి సుకుమార్ రెండు టికట్లు తీసుకున్నాడు.

రైలు సైట్ కాగానే రెండోగంట మోగింది

రైలు ప్లాట్ఫారంవద్దఆగింది జనమంతా దిగసాగారు; అంతకంటె ఎక్కేవాళ్ళ తొందర మరీని

అహల్యా సుకుమారులు ఇంటర్ కొసు పెట్టెవద్దకు వెళ్లారు. అక్కడెవడో ఆఫీసరు సామాన్లు దిగుతుండడంవల్ల మూడునిమిషాలు వాళ్లు నుంచోవల్సి వచ్చింది

చివరికి రైలు ఎక్కబోయారు. "ఆగండి!" అనే కేకలు వినపడ్డాయి

సుకుమార్ ఆశ్చర్యపోయాడు! ఎవరు చెప్మా? పోలీసుకాదు గద!

ఆ ముసలాయన వొగుర్చుకుంటూ వచ్చాడు.

సుకుమార్ కు ఏంచెయ్యాల్లో తోచలేదు తల తీసినట్టయింది శరీరం భూమిలోకి చొచ్చుకుపోతుందేమో అనుకున్నాడు ప్రయత్నమంతా గంగ కల్సినందుకు మండిపోసాగాడు.

"రండి. బయట టాక్సీవుంది" అన్నారు ఆముసలాయన

"పదండి" అంది అహల్య

సుకుమార్ అనుసరించక తప్పలేదు కారులో ఆయన అన్నాడు! "ఈమాత్రం దానికి ఇంత ఆర్భాటమెందుకు? నాకూతురు పెళ్ళి సమస్య తీరింది! నన్నడుగు నేనే పెళ్ళిఏర్పాట్లు చేసేవాణ్నిగా"

సుకుమార్ ఏదో పరాభవం జరుగుతుందనుకున్నాడు. కాని కథ అడ్డంతిరిగినా, మలుపు మంచికే వొస్తున్నందుకు తనలోనే సంతోషించాడు

వెధవ సెలవు! నెల్లాళ్లుఅనవసరంగా జీతం లేకండా పెట్టాల్సివచ్చును

*   *   *

పెళ్ళియిన కొన్నాళ్లకి అహల్యని అడిగాడు.

"మన ప్రేమకలాపం సంగతి మీనాన్నకి తెల్సా?"

"ఆc!"

"మనం పారిపోదామనుకున్నది ?"

"ఆc!"

"మరెందుకు ఊరుకున్నారు?"

"అందుకనే"

"అంటే"

"మన పెళ్ళి కావాలని మానాన్న గొప్ప దూరదృష్టికలవారు అసలు పైవేటు ఏర్పర్చిందికూడా నా పెళ్ళినిగురించే"

"అదెట్లా?"

"ఎట్లాఅంటే మనుషులకు ఎదటి వస్తువులపై ఆకర్షణఉండదు; దూరపుకొండలు నునుపుగా, నీలంగా వుంటాయని భ్రమపడి మోజు పడతారు అని మానాన్న నమ్మకం. దీన్ని నిరూపించడానికే ఈవిధంగా చేశారు"

కిలకిలా నవ్వసాగింది

"ఇంకా......"అన్నాడు.

"అదీగాక మామూలుగా పెళ్ళిచూపులకు పిలుస్తే నిచ్చెనెక్కుతున్నారు యువకులు ప్రేమలోపడేలాచేస్తే కట్నంభ్రమపోతుందని మానాన్న ఎత్తు ఎత్తారు"అంది.

"అయితే నీ కెలా కలిగింది, ప్రేమ"

"మీసుకుమారత్వాన్ని చూసి"

సుకుమార్ అలాగే కుర్చీలో చతికిలబడి "సాహసకార్యం చెయ్యబోయిసాలెగూట్లో చిక్కడలేదు కద!" అనుకున్నాడు. ★

---

"ఏమయ్యా! నువ్వు ఆపిల్ల మెళ్ళో నగఎత్తుకు పోతూండగా చూచిననలుగురి సాక్ష్యం బలంగావుంది. నువ్వు చెప్పుకునేది ఏమన్నావుందా" ముద్దాయిని ప్రశ్నించాడు న్యాయాధికారి.

"నేను ఏపాప పుణ్యమూ ఎరగనండి"

"మరి సాక్ష్యం సంగతో?"

"తామీవిషయం చూడేలేదని వెయ్యమంది చేత సాక్ష్యం పలికించగలనండి" అన్నాడుముద్దాయి ధీమాగా.

జి. కేశవరావు.

---

"ఏమండోయ్ ప్లీడరుగారూ! గంటనుంచీ మీరు చెప్పేవాదనంతా యీ చెవినుంచి ప్రవేశించి అటునుంచి పోతూవుంది" అని మరో చెవి చూపించాడు మున్సబుగారు- ఆయనవాదనలో సారంలేదని సూచిస్తూ.

"అల్లా నిరాటంకగా బయటికిపోవటం మాకు చాలా యిబ్బందిసుమాండి" అని ఆ ప్లీడరు తనకష్టం చెప్పుకుని, ఆ పైనఅన్నాడు

"అందుకనే తమ ముందు మున్సబుగారు వాదనవినేటప్పుడల్లా పెన్సిలు ఆరెండో చెవిలో దోపుకునేవారు."

జి. కేశవరావు

*   *   *

తండ్రి: అబ్బాయీ! రఘూ నువ్వుక్లాసులో ఆఖరువాడవుటేమిటి? ఈరోజు తెలిసింది!

రఘూ: అవునునాన్నా! నా తప్పేమీలేదు. తప్పంతా మా క్లాసులో రాముఅనే కుర్రాడిది నాన్నా! చిన్నతనాన్నుంచీ మా బడిలోనే తగలడ్డపీనుగు ఇప్పుడు సర్టిఫికేటు పుచ్చుకొని లేచి చక్కాపోయాడు. అందుకని ఇల్లావచ్చింది.

యం. వి. సీతాపతిరావు, ఖండవల.



# 21

జగ్గయ్యపేట పోయేరోడ్డుమీద కొండవెనక మలుపు తిరిగిం తర్వాత మూడో ఫర్లాంగురాయిదగ్గిర ఒక పాడుపడ్డ పెంకుటి ల్లున్నది. చుట్టుపక్కల అటూ ఇటూ గుంయ్‌మంటూ తాటితోపు లున్నాయి. రెండుఫర్లాంగులమేర చుట్టుపక్కల ఎక్కడా ఇల్లన్న మాటలేదు నరవాసన అసలే శూన్యం. వరదరాజు రత్తెమ్మని సత్యానికి అప్పజెప్పి ఈదారినపడ్డాడు హుషారుగా నడుస్తూ. కొండమలుపుకి ఇవతల రాత్రి హోటలు ఒకటున్నది, మహమ్మదీయుల్ది అక్కడ ఆగి వరదరాజు టీ తాగి, టైం అడిగాడు." పద కొండున్నర అని సమాధానం వొచ్చింది.

"ఓస్! అరగంటలో మైలు! తేలిగ్గా వెళ్లొచ్చు" అని తనకి తాను చెప్పుకుంటూ వరదరాజు సిగరెట్టు వెలిగించుకుని, కొండ మలుపు తిరిగాడు వాన ఉధృతం తగ్గిందిగాని తుంపర పడుతోనే వుంది. వరదరాజు దీర్ఘంగా ఆలోచిస్తూ వొంటిమీది తడిసినబట్టల జ్ఞాపకమేనా లేకండా నడుస్తున్నాడు తొందర తొందరగా. దారి పొడుగునా మైలువరకు వీధిదీపా లుండటంవల్ల చీకటిబాధ లేదు.

వర్షపునీరు ప్రవహిస్తున్న తారురోడ్డుమీద వీధిదీపాలకాంతి మెరుస్తోంది. కృష్ణానది హోరూ ఈదురుగాలీ కలిసి భయం గొల్పుతున్నాయి. ఏమాత్రం పిరికివాడైనా ఆ అర్ధరాత్రి వేళ అటువంటి వాతావరణంలో గుండె చెదిరి పారిపోతాడు.

వరదరాజువెనక వీధిదీపాలకాంతికి పుట్టి నీడపడి పొడుగ్గా సాగి చీకట్లో కలుస్తోంది. వరదరాజు దేన్నీ గమనించటంలేదు. అతని ఆలోచనంతా ఆ పాడుపడ్డ ఇంట్లో జరుగుతున్న వ్యవహారం మీదేవుంది. ఆపని చాలాఅపాయంతో కూడుకొన్నది. అయితేఏం? అటువంటిపన్లుచేస్తేనే డబ్బు వస్తుంది. .

వరదరాజు అరగంట గడవకముందే తాళ్ళతోపులాంటి ఆ గుబుర్లలోకి ప్రవేశించాడు. రోడ్డుకి కుడివేపు వంద గజాల దూరంలో వుందాయిల్లు రోడ్డుదిగువ వొట్టి బురదలో వంద గజాలూ తాళ్ల గుబుర్ల చీకట్లలో నడవాలి. కాలిబాట జారుతూ వుంది. వర్షధారలు తాటిచెట్లమీదపడే చిటపట శబ్దం, గోండ్రు కప్పల ఎడతెగని బెక బెక అరుపులూతప్ప మరొకధ్వని లేదు అంతా కారుచీకటిగా వుంది వరదరాజు మెల్లిగా నడుస్తున్నాడు. ఇల్లు ఎంతోదూరంలో లేదు. చీకటిముద్దలా కుప్పగా కనపడే అనీడే ఇల్లు. తూర్పువేపుకి వంగిపోయి వికృతంగా కన్పిస్తోంది.

వరదరాజు ఈఇంటికి చిరపరిచితుడు. కోటిగాడు ఈఇంట్లోనే కాపరం పెట్టాడు చాలాకాలంబట్టి. కారణం అద్దెలేకపోవటమే. కాపరం ఇంటిలోపలకాదు. బైట వరండాలో. ఆ వరండాలో పడమటమూల వర్షం కురవదు. కొంచెం బాగున్న జాగా అదే.

వరదరాజు తాటిగుబుర్లుదాటి ఇంటిఆవరణలో ప్రవేశించాడు. నేల గతుకులు గతుకులుగా వుంది. నీళ్లు నిలిచివున్నాయి ఇంటి చుట్టూ. ఇల్లు ఓ ద్వీపంలా వుంది. వరండాలో ఎవళ్లో అడుక్కునే వాళ్ళూ, అనాథలైనవాళ్ళు కొంచెం పొడిగావున్నచోట్ల ముసగ దీసుకొని పడుకుని వున్నారు. పిల్లా పాపా, పెద్ద—చిన్న తోట కూర కాడల్లా పడివున్నారు.

వరదరాజు విరిగిపోయిన ఇటికరాతిమెట్లు జాగ్రత్తగా ఎక్కి వరండా దాటి లోపలికి వెళ్ళాడు. మధ్య హాలులో చిన్న బెడ్ రూంలైటు మినుకు మినుకుమని వెలుగుతో అక్కడి చీకటిని పార దోలటానికి వ్యర్థప్రయత్నం చేస్తూంది. హాలంతా పైకప్పు చిల్లులు పడిపోయి ధారాపాతంగా వర్షపునీరు కారుతోంది. నేలంతా గతుకులు గతుకులుగా గచ్చు లేచిపోయింది. గోడలు ఏకాలం నాటివో సున్నపుగారలు పెళ్లలూడిపోయి దిగులుగా అగుపిస్తున్నాయి.

హాలుకు ఆనుకునివున్న ఓ గదిలోనుంచి లాంతరు వెలుగు పడుతోంది బైటికి. గది తలుపంతా చెదలు తిని ఏ క్షణాన్నైనా పడిపోవొచ్చు ననిపిస్తోంది.

వరదరాజు కొద్దిగా దగ్గాడు, సౌజ్ఞ చేస్తున్నట్టు. గదిలోనుంచి పడుతున్న వెలుగు మాయమైంది.

గదిలోనుంచి ఏడుకొండలు బైటికి వచ్చి "రా. రా. నీకోసం చూస్తున్నారు ఆళ్లంతా" అన్నాడు మెల్లిగా.

ఇద్దరూ ఒకరి వెనక ఒకరు గదిలోకి వెళ్లారు.

ఆ గది ఐదారు గజాల చదరం వున్నది. పెంకుటికప్పు శిథిలావస్థలో వుంది. సగం గది వాన నీటితో తడిసింది. కిటికీలు వేసి వున్నాయి వాటి ఊచలన్నీ తుప్పపట్టి జీర్ణించిపోయి గాలికొడితే ఊడిపొయ్యేలా వున్నాయి గది మధ్య ఓపాత టేబిల్ మీద లాంతర్ బాగా తగ్గించిపెటారు ఇంకో ముగ్గురు కిటికీల అంచులమీద కూర్చున్నారు సిగరెట్లు కాలుస్తూ. ముగ్గురూ, నాగరికంగా డ్రెస్ వేసుకుని వున్నారు లాంతరున్న బల్లమీద పెద్ద సైజు రేడియో అంతి పెట్టి వొకటి వుంది. రేడియో అనుకోవల్సిందే, హఠాత్తుగా చూస్తే. రేడియో కుండవల్సిన బాహ్యలక్షణాలన్నీ వున్నాయి దానికి. పక్కనే డ్రైబాటరి ఒకటి వుంది

వరదరాజు, ఆ ముగ్గురిలోనూ పొడుగాటి వ్యక్తిని గుర్తుపట్టి, "మీరా! ఇదేనా, మీ రాయేల చెప్పింది!" అని అడిగాడు, అతని పక్కకి వెళ్ళి నుల్చొని

పొడుగాటి వ్యక్తి, "ఆఁ! ఇదే గంటకి.. ..." అంటూ

చుట్టూ చూశాడు. అతని మనసులో ఏదో జరుగుతున్నట్టు తోచింది వరదరాజుకి.

"భయపడకండి" అంటూ వరదరాజు ఏడుకొండలు వేపు తిరిగి "నువ్వెళ్ళి బయట వుండరా! కోటిగాడు తూగుతున్నాడేమో! దొంగలు, జాగర్త. బీడీ కాల్చకు." అన్నాడు. "ఓరన్నా వొస్తే, ఈలెయ్యి" అని ఆజ్ఞాపించాడు.

ఏడుకొండలు వెంటనే బయటకి వెళ్ళాడు

వరదరాజు అతని వెనకనే వెళ్ళి గది తలుపు వేసివచ్చాడు.

పొడుగాటతను "ఇది గంటకి రెండు మూడు వేల కాయితాలు అవలీలగా లాగేస్తది. మా కెక్కడా రహస్యంగా తయారుచేసేందుకు చోటు దొరకలేదని చెప్పామా! చివరికిక్కడ కుదిరింది. వేద్దామా అంటే వానా గాలీను! ఈ కాయితాలు ఎండొద్దూ!" అన్నాడు మిగిలిన ఇద్దరికేసీ చూస్తూ.

వరదరాజు ఆ రేడియో పెట్టిదగ్గిర కెళ్ళి పరీక్షగా చూస్తూ, "ఏదీ కాస్త చూపించండి ఇది ఎట్టా పనిచేస్తుందో!" అని అడిగాడు ఆసక్తితో.

పొడుగాటతను ఆ యంత్రందగ్గిరకి వొచ్చి, దానికింద సొరుగులాంటి భాగాన్ని లాగి, దాన్లోంచి వంద రూపాయల కాయితం సైజులోవున్న తెల్లకాయితాన్నొకదాన్ని తీసి, యంత్రం పైభాగానవున్న ఇంకో సన్నటి సొరుగులో పెట్టి బ్యాటరీకున్న ప్లగ్‌ను యంత్రానికి తగిలించాడు. యంత్రంలోంచి, 'గ్ర్ర్' అని శబ్దం రాసాగింది. ముందుభాగంలోవున్న అద్దంమీద బల్బులు వెలిగాయి. ఆ బల్బులలో ఎరుపు, పసుపు, నీలం మూడురంగులున్నాయి. అవి వరసగా మూడుసార్లు వెలిగి ఆరిపోగానే, కింద వున్న మరొక రంధ్రంగుండా ఒక వంక కాయితం బైటకి వచ్చింది. యంత్రం ఆగిపోయింది. పొడుగాటి వ్యక్తి, బ్యాటరీకి, యంత్రానికీ వున్న ప్లగ్ తొలిగించాడు. వరదరాజు ఆశ్చర్యంగా ఆ వొచ్చిన వందకాయితాన్ని చేతిలోకి తీసుకుని చూశాడు. ఏదో ఆలోచనతట్టి, తనిందాక శాస్త్రిదగ్గిర లాక్కున్న వందరూపాయల నోటుతీసి రెండింటిని లాంతర్ ముందు పోల్చి చూశాడు. దొంగనోటు ఏదో, నిజమైననోటు ఏదో ఆ రెండింటినీ కలిపి కొత్తవాడికిస్తే కనుక్కోడం చాలా కష్టం.

వరదరాజు తన మొహంలో ఆశ్చర్యాన్ని ఆసక్తిని కనపర్చకుండా చాలా సహజంగా, "అయితే ఇంకెందుకు ఆలస్యం చెయ్యండి, కొద్దో గొప్పో ఆలస్యమైతే మళ్ళీ వోరన్నా" అన్నాడు.

పొడుగాటి వ్యక్తి తన స్నేహితుల్లో ఒకణ్ణి "రాజూ, ఎండ లేందే సాగదురా ఈ వ్యవహారం. ఈ కాయితాలన్నీ కొంచెం తడిగా వున్నాయి ఆరొద్దూ!". "ఎట్లా?" అని ప్రశ్నించాడు.

రాజు సమాధానం చెప్పకముందే వరదరాజు, "అరే, వయ్యండయ్యా! రేపు నే నెండబెట్టిస్తాలే. మా బలగమంతా బైట కాపలా వుంటది. మీకేం భయంలేదు. వోరన్నా వొస్తే ఒక్క ఈలేస్తరు. ఎక్కడిపిట్ట అడనే గప్‌చిప్ —" అని తన ధోరణిలో మెల్లిగా నవ్వాడు.

రాజు లాగూ జేబులో చెయ్యిపెట్టుకుని, "నిజమే గాని, వరదరాజుగారూ! వీటిన్నెక్కడ ఎండబెడతారు? ఈ యింటిలో పొడిగావున్న చోటేలేదు! ఎక్కువరోజులు టైంలేదు! రెండు మూడు రోజుల్లో మకాం మార్చకపోతే—పోలీసులు .." అన్నాడు మెల్లిగా.

పొడుగాటాయన పేరు నరసింహారెడ్డి. ఏ కాలేజీలోనో ఇంజనీరింగ్ డిగ్రీ సంపాయించాడు. స్వతహాగా యంత్రాలు పరీక్ష చెయ్యడంలోనూ నమూనాలు తయారు చెయ్యడంలోనూ గట్టి ఖిలాడి. రాయలసీమలో ఓ వూళ్ళో, ఏదో వర్క్‌షాపుగూడా వుందతనికి. అక్కడే చేశాడీ యంత్రాన్ని. అత నందుకుని, "అవునండి వరదరాజుగారు. మీ సహాయంలేందే ఈ పనికాదు. చెయ్యటానికి మేము రాత్రికి, పాతిక వేలు వేసేస్తాం. ఎండపెట్టడం మీ వంతు. సగం మీరు తీసుకోండి..." అన్నాడు.

వరదరాజు కళ్ళు మెరిశాయి. నిష్కల్మషంగా నవ్వాడతను "అరే మీ రింకా బయపడుతున్నా రంటయ్యా! గంట పన్నెండు దాటివుంటది. కానియ్యండయ్యా! ఈ రేత్రి ఎంతేస్తే అంతా రేపు సాయంత్రానికి మంగళాజపురం కొండకాడ మా కోకడున్నాడులే. దొంగ సారా కాస్తుంటడు—ఆడింటికాడ ఎండబెట్టిస్తా. ఆడికి ఎవరూ రారు .. నే వున్నాగా! కానియ్యండి..." అని ధైర్యం చెప్పాడు.

ముగ్గురు నాగరికుల మొహమూ వికసించింది.

రెడ్డి, "అయితే అలా కూచోండి, కిటికీదగ్గర. మం కాయితాలనిట్నే" అని, మూడో అతనిదగ్గిరవున్న తోలుసంచి చూపించి "తయారుచేసి అందులో పెడతాం." అన్నాడు.

ఆతర్వాత, తిరిగీ యంత్రం 'గ్ర్ర్' మన్న మోతతో పనిచెయ్యసాగింది. కాయితాలు వరసగా దిగుతున్నాయి. నిమిషాని కొకటి. చొప్పున వరదరాజు, సిగరెట్ వెలిగించి దానివంక చూస్తూ కూర్చున్నాడు.

రెడ్డి తోలుసంచీలోంచి, పెద్ద కట్ట తెల్లకాగితాలు తీసి యంత్రంలోకి అందిస్తున్నాడు. రాజు యంత్రంపైన వున్న మూడు గరాటాల్లోకి రంగునీరాలు పోస్తున్నాడు. మూడో అతను, అచ్చయిన కాయితాలు జాగ్రత్తగా పేరుస్తున్నాడు.

బైట మెరుపులు వురుములతో జోరుగా వర్షం కురుస్తోంది. తాటిచెట్లగుండా దూసుకుని పోతూన్న గాలిహోరులో యంత్రం శబ్దం వినిపించటంలేదు. వరదరాజు చూపు నిమిషానికోసారి తలుపుమీదికీ యంత్రంమీదికీ మారుతోంది.

గంటగడిచాక నలుగురూ గది మూలనున్న పెద్ద ఫ్లాస్కులో కాఫీని, నాలుగు గుక్కలు తాగారు. పని మళ్ళీ తీవ్రంగా కొనసాగింది. గంటలుగడిచాయి. దొంగనోట్లు కుప్పలు కుప్పలుగా తయారైనాయి. తెల్లారకట్ట నాలుగైంది. రెడ్డి రిస్టువాచీ చూశాడు.

బైట తలుపుదగ్గిర ఏడుకొండలొచ్చి దగ్గాడు. వరదరాజు వెళ్ళి తలుపు ఓరగా తీసి, "ఏం?" అని ప్రశ్నించాడు.

ఏడుకొండలు, "తెల్లారొస్తుందిరా! మనుషులు తిరుగాడతా రింక కట్టెయ్యండి గుకాణం" అన్నాడు, భయంగా.

"ఒరే. వుండరా. పిరికియెదవ. ఈడ పనికూడా అయిపోయిందిలే. వుండొస్తున్నాం" అంటూ తలువేసి లోపలికెళ్ళాడు.

లోపల రెడ్డి యంత్రాన్ని కట్టేశాడు. రాజు కట్టలన్నీ కట్టేశాడు. అన్నిటినీ తోలుసంచిలో సర్దేశారు నలుగురూ. యంత్రం మీగ ఖాకీగుడ్డ తొడుగొకటి తొడిగారు. గదిలో చిల్లర కాయితం ముక్కల్ని జాగ్రత్తగా ఏరిపారేశారు సంచిలోకి.

వరదరాజు, "రేపు సాయంత్రం ఏడుకొండలుతో వస్తే ఆడు చూపిస్తాడు ఆ యిల్లు. అపు సరిజేసుకుందాం. సరా!" అన్నాడు.

"రెడ్డి, సరేలెండి! అంతా నమ్మకంతోటె వుంది! అంతే గదరా రాజూ!" అన్నాడు.

వరదరాజు నవ్వాడు. "అవును బాబయ్యా! మీకేం బయ్యం. మక్కర్లా. ప్రాణాలకి తెగించి ఈపని చేస్తున్నాం! ఇందులో మోసం చేస్తే నలుగురంపోయి పోలీసులికి దొరికిపోతాం!.. నీతి వుండాలిగా, ఏదైనా! మన్లో మనకి మోసం, తగూ పనికిరావు." అన్నాడు, నిక్కచ్చిగా.

తర్వాత ఆ యంత్రాన్ని టేబిల్ కింద, నాపరాతిని లేవదీసి, నేలలో తవ్విన గోతిలోపెట్టి, నాపరాయి యథాప్రకారం సర్దారు ముగ్గురూ. వరదరాజు తోలుసంచీ చేత బుచ్చుకున్నాడు.

మిగతా ముగ్గురిలోనూ, "తలా వో దారిన పొండయ్యోవ్! అంతా గుంపుగా పోకండి..." అంటూ తలుపుతీసి, హాల్లోకి వచ్చాడు . వాన ఇంకా తగ్గలేదు. చీకటి విడలేదు ఆకాశం మబ్బులుకమ్మి చీకటిగావుంది వాతావరణమంతా.

అరగంటలో, ఆ పాడుపడ్డ కొంప నిర్మానుష్యమైపోయింది.

## 22

శ్రావణ బహుళపంచమి. చంద్రుడు మబ్బుల్లోంచి మసక వెన్నెల ప్రసరిస్తున్నాడు నాలుగు గంటలదాకా వాన కురిసి వెలిసింది గాలి స్వచ్ఛంగా కొత్తమన్ను పరిమళాన్ని మోసుకొస్తోంది రంగయ్యగారింట గడపకి మామిడాకుల తోరణం వేళ్ళాడుతోంది. గడపలు పసుపు పూసి శుభకార్యపు కళని ప్రచారం చేస్తున్నాయి.

జయలక్ష్మికి కార్యం ఆనాడు. ప్లీడరు శేషాద్రిరావుగారూ, ఆయన సతీమణి జానకమ్మగారూ, కొడుకు త్రయంబకరావూ, రమణమ్మ అందరూ ఆ వేళ మధ్యాహ్నం బండికే దిగారు. జానకమ్మగారూ శేషాద్రిరావుగారూ వియ్యంకుడింట్లో అడుగుపెట్టినదగ్గర నుంచీ—అడపా దడపా సంభాషణలమధ్య డబ్బుసంగతి తెస్తూనే వున్నారు రంగయ్యగారికి కీళ్లు పట్టుతప్పుతున్నట్టున్నాయి, ఆయన శతవిధాల ప్రయత్నించారు—ఎక్కడా డబ్బు దొరకలేదు, ఉన్న కొత్త పొలం వెనకటి బాకీకే సరిపోయింది, వడ్డీ తీసేస్తే

ఆయన వుద్దేశం ఈ శుభకార్యం వెళ్ళిపోతే ఎలాగో చెప్పుకుని సర్దుకోవచ్చని. తనకు మల్లేనే అందరికీ మంచి హృదయం వుండదా అని ఆయన ఆశ.

ఈ సంభాషణలు మధ్య హాల్లో జరుగుతూండంగానే రమణమ్మ తమ్ముణ్ణి దొరకపుచ్చుకుని పక్కన అల్లుడికని ప్రత్యేకించిన గదిలో సంభాషణకి దిగింది.

"అక్కయ్యా, ఎందుకే నన్నిలా వేధిస్తున్నావూ? నేనేం రాక్షసుణ్ణనుకున్నావా?" అన్నాడు తమ్ముడు విరక్తితోనూ విషాదంగానూ

"అది కాదురా నాజమ్మా! అమ్మ నాన్నా డబ్బుకోసం ఏమైనా చేసేటట్టున్నారు. ఆపిల్లఖర్మ కాలితే—కిడెంచి మేలెంచమన్నారు—మీ మామగారికి డబ్బు అందలేదనుకో అప్పుడేమౌతుందంటావు? చెప్పు" అని అడిగింది, రమణమ్మ

"ఏమౌతుంది?" సంశయాస్పదంగా చూశాడు త్రయంబకరావు.

"అదే. అక్కడేవుంది తిరుగుడంతా. ఆడబ్బు సాయంత్రానికి నాన్న చేతుల్లోపడకపోతే ఎక్కిరైలు అంటాడు నిన్ను. అప్పుడేం చేస్తావు నువ్వు?" అని నిలేసింది అక్క.

"ఏంచేస్తాను?" నిలువుగుడ్లుపడ్డాయి తమ్ముడికి పితృవాక్య పరిపాలకుడూ, స్వబుద్ధిశూన్యుడూ అయిన ఆయువకుణ్ణి చూస్తూంటే రమణమ్మకి అరికాలిమంట నెత్తికెక్కుతున్నది కాని ఏం చెయ్యటం! తమ్ముడు తను చెబితే వింటాడనే నమ్మకమైతే ఆమెకున్నది కాని, నిజంగా అలాంటిపరిస్థితేవొస్తే అప్పుడేం చెయ్యాలో ఆమెకీ తోచకుండా వుంది.

"కృష్ణలో దిగు. నాజ. చాతకాని మొద్దు. ఇట్లాంటివి నేనే చెప్పాలిట్రా! వాళ్లిచ్చేడబ్బే కావాలా మనకి? అది లేకండా జరగదట్రా? ఉన్నదంతా చాలదట్రా? 'నాపెళ్లాన్ని నేను నాతో తీసుకొస్తాను' అని మొండికెత్తరా నాజా! నాన్నా అమ్మా, నువ్వ అడిగితే మళ్లీ నోరెత్తరు. నువ్వంటే వాళ్ళ కెంత గారాబమో, ముద్దో, నీవాలకం, నీ పెంపకం చూస్తే తెలయటం లేదట్రా? అదీ ఎత్తు. కాదూ కూడదంటారూ! ఇంట్లోంచి లేచిపోతానను. కోరీ వారీ లేని బంగారుబొమ్మలాంటి ఆ పిల్లని డబ్బుకోసం వొదిలేసుకోకు,! తర్వాత నీయిష్టం నువ్వు వాళ్ల వెంటే చేరతావూ, నేను తిరిగి తెనాలి రాను; ఇటునించి కాశీకిపోతా, ఖాయం అంది అక్కగారు గొంతు తగ్గించి

త్రయంబకరావు కుర్చీలోనుంచి ఉల్లిపడ్డాడు. "శభాష్ అక్కయ్యా! శభాష్! భలేసలహా చెప్పావు. రాజకీయపు టెత్తు వేశావు నా మాట కాదంటారూ! అభోజనం పడుకుంటా. నా పెళ్లాన్ని నేను తీసుకెళ్ళకండా మళ్ళ వీళ్లేవరూ? చూస్తాగా!" అన్నాడు ప్రతిజ్ఞచేస్తున్నవాడిలా మళ్ళీ అన్నాడు, "ఇంక నన్ను పూరికే, నాజనాజ అని చంపకే అక్కా! నువ్వు చెప్పినట్టల్లా చేస్తాగా! సరా" అన్నాడు బతిమాలుతున్నట్టు.

"సరిగ్గావుంటే ఎందుకంటారా నిన్ను! .." అంటూ రమణమ్మ బయట మాట్లాడుకుంటున్న మాటలు చెవులురిక్కించి వినసాగింది

"అది కాదండీ బావగారూ! పైకంకోసం ఇప్పటిదాకా ఎదురుచూశాను ఇప్పుడో ఇంకా కాసేపటికో వస్తుందిలెండి తప్పకుండా సాయంత్రంలోగా అందుతుందిలెండి" అన్నాడు రంగయ్యగారు, వియ్యంకుడితో

శేషాద్రిరావుగారు మధ్యాహ్నం టిఫిన్ గారెలు తింటూ, మధ్య మధ్య మాట్లాడుతున్నాడు గావును, నంగిగా వొస్తున్నాయి మాటలు. "పైకం చాలా అవసరమండీ. అందుకని..... లేకపోతే ఇంతగా అడుగుతానా! అందులో మిమ్మల్ని" అంటున్నాడు చాలా సౌక్యంగా

గదిలో రమణమ్మ తమ్ముడివంక తీవ్రంగా చూసి, "ఏమిటా అవసరం నాయనా?" అంది మెల్లిగా.

తమ్ముడు తల పైకెత్తి పైకప్పువంక చేతులు చూపిస్తూ "దేవుడికి తెలియా" లంటున్నాడు

"ఎలాగో, సాయంత్రానికి అందించండి, టి. ఎం. వో. చేస్తాను" అన్నాడు ప్లీడరుగారు కాఫీ చప్పరిస్తూ.

రంగయ్యగారికి గుండెల్లో రాయి పడ్డది. ఎలాగా! సాయంత్రానికి కాదు, ఇంకో వారానికైనా సంతన అవుతుందా అనేది ప్రశ్న! . . పైమాత్రం రంగయ్యగారు గంభీరంగా వున్నాడు. మాటలు ఇంకో విషయంమీదికి మారాయి.

రమణమ్మ,"జాగ్రత్తరా అబ్బాయి, ఇదే చెప్పడం ఇంకోటి రోయ్ రాత్రి, నీ పెళ్లాన్ని మెల్లిగా పలకరించు. అది నిన్ను చూసి ఝడుసుకునేట్టు కాదుసుమా!" అంటూ బైటికి వెళ్ళిపోయింది.

త్రయంబకరావు ఆ గదిచుట్టూ చూశాడు. అదే కార్యపు గది. సాధ్యమైనవిధంగా అలంకరించబడివుంది గోడకి నాల్గువేపులా బొమ్మలు బావమరిది సదానందం వేసినవి గావును; త్రయంబకరావుకి నవ్వొచ్చింది వాటిని చూస్తే పడకకుర్చీలో పడుకుని, అక్క చెప్పిన మాటల్ని నెమరుకు తెచ్చుకుంటున్నాడు కనీసం పదిసార్లేనా రిహార్సల్స్ వేసుకుంటే గాని, ఆ నిక్కు అమ్మ నాన్నా ముందు మాటలే పెగలవు నోటంబడి వొచ్చిందగ్గిర్నించీ చూస్తున్నాడు అతను; పెళ్ళాం కనపడుతుందేమోనని కాని జయ ప్రాజ గదిలోనించి బైటకే రాలేదు ఆమెని సిగ్గో కవంకా, మొగుడంటే ఏదో తెలియని భయం ఇంకోవంకా పీడిస్తున్నాయి

ఈలోగా సదానందం, బావగారికి టిఫిన్ తెచ్చిపెట్టాడు. టిఫిన్ తింటూ త్రయంబకరావు సంభాషణ ప్రారంభించాడు బావమరిదితో.

"బావా! నాన్నగారు ఏమిటీ—అంటున్నారు?" అని అడిగాడు.

సదానందం, "నాకు తెలీదు బావా. అవి పెద్దవాళ్ల సంభాషణలు" అన్నాడు.

త్రయంబకరావు, "అది పోనీ, నువ్వెందాకా చదవదల్చుకున్నావోయ్!" అన్నాడు.

"ఏమో, బావా! ఈయేడుతో మానేద్దామనుకుంటున్నాను"

"ఏం? కంటిన్యూ చెయ్యరాదూ?"

"ఇంకా తేల్చుకోలేదులే. వూరికే అన్నాను" అంటూ ఈ సంభాషణ నచ్చక సదానందం, "కాఫీ తెస్తాను" అని వెళ్లిపోయాడు.

ఆరాత్రి దంపతుల్ని గదిలోకి పంపేముందు డబ్బు పేచీ మళ్లీ వచ్చింది. "తెల్లారేసరికి ఇస్తే సరిగా" అన్నాడు రంగయ్యగారు ప్రాణాలు బిగబట్టుకుని. దానికి వంతపాటలే త్రయంబకరావు "ఒక్క పూటలో మునిగిపొయ్యేదేమిటి నాన్నా!" అన్నాడు.

తల్లీ తండ్రీ ఆశ్చర్యంగా చూశా రతనివంక—ఇదేమిటి! అకస్మాత్తుగా వీడికి స్వబుద్ధి పొడసూపింది!—అన్నట్టు.

కాని అప్పటి వుద్రేక వాతావరణం తగ్గిపోయింది. శేషాద్రి రావుగారివేపు ఒక్క వోటు తగ్గింది.

ఆ రాత్రి చినుకులతో ఆరంభమైంది. వాతావరణం కొత్త దంపతులకు గిలిగింతలు పెట్టేట్టుగా వుంది. దానికితోడు కొత్త గుడ్డల, వాసనా, సాంబ్రాణి ఘుమఘుమలూ, రుచ్యమైన భోజనం, ఏదో తెలియని ఒక సుఖాన్ని ఎదురుచూస్తున్న ఆ తొలిక్షణాల మాధుర్యం, వానముందు సన్నని చల్లగాలిలా త్రయంబకరావుకి మధురానుభూతిని కలుగచేస్తున్నాయి.

జయ మనస్సు రకరకాల భావనలతో నిండిపోయివుంది. మొగుడంటే ఆమెకొక అసహజమైన భయం, ఆదుర్దా పేరుకుని ఊపిరాడనియ్యటంలేదు. ఆ క్షణం అతన్ని కలుసుకోబొయ్యే ఆ తొలిక్షణం కోసం ఆమె విపరీతమైన ఆదుర్దాతో ఎదురుచూస్తూంది.

తల్లి వాత్రీప్రకారం కూతురికి చెప్పింది. 'గాభరా పడవల్సిందేమీ లేదు తల్లీ! భర్తకి మొదటి తడవే సదభిప్రాయం కలిగేట్టు చేసుకోవాలమ్మా! అతనికి నువ్వంటే ఆసక్తీ, అనురాగం కలిగేట్టు ప్రవర్తించితే జీవితం సుఖంగా గడుస్తుంది. మిగతావాళ్లతో నీకేంపని! మొగుడే నీవాడయినాక!"

జయ తలెత్తి తల్లి కళ్లలోకి చూసింది. తల్లి సంతోషంగా, కళ్లలో నీళ్లు నింపుకుని కూతుర్ని దగ్గరకి లాక్కుంది. పద్దెనిమిదేళ్ళు తన రక్తం, తన అనురాగం సమపాళ్లంగా కలిపి పోషించి పెంచి, ఈనాడు ఇంకొకరికి అప్పచెప్పతున్నది ఈ పసికందుని.

వయసు వచ్చినమాట నిజమే. కాని కొత్తచోటు—ఎలా మెలగాలో ఆ లేతహృదయానికి తెలుసా? ఆపాటి అర్థం చేసుకునే వ్యవధిని అత్తమామలూ, భర్తా ఇస్తారు!" ఈ పువ్వును ఇలా తనకు మల్లేనే జాగ్రత్తగా పోషిస్తారా? లేక...ఆమె కీడెంచలేదు. కూతురు ముఖంలోకి చూసింది.

తలంటి పోసుకుని గాలికి రేగి, కమ్మని సువాసనలు వెదజల్లుతున్న నల్లని నిగనిగలాడే జుట్టూ; నిమ్మపండు వన్నె శరీరం; జ్ఞానాజ్ఞానాల పరిహద్దులలో అమాయకంగా కనిపిస్తూన్న పాలుగారే మొహం, భయం ఆదుర్దా కలిసి విద్యుద్దీపాలకాంతిలో ప్రతిఫలిస్తున్న నల్లని కనుపాపలూ; జయ, తల్లికి పద్దెనిమిదేళ్లుగా గాఢ పరిచయసురాలే అయినా, ఎప్పటికప్పుడే ఆ సౌందర్యంలో ఒక మార్పు, ఒక కొత్త శోభ కనపడుతున్నాయి. చిన్నప్పటించీ ఆ శోభా ఆ సౌందర్యం వికసించి ఈనాడు పరిపూర్ణ వికాసానికి దాపులో వుంది.

తల్లి, జయ రెండు బుగ్గలమీదా గాఢంగా ముద్దెట్టుకుంది. జయ కెందుకో చెప్పరాని ఆవేదన, శోకం కట్టలు తెగాయి "అమ్మా!" అని తల్లిని గట్టిగా కౌగిలించుకుంది.

తల్లి అమ్మాయితల నిమురుతూ, "ఎందుకు తల్లీ!" అన్నది ఆప్యాయంగా.

కూతురు తలెత్తిచూసింది. ఆమె విశాలమైన కళ్లనిండా నీళ్లు తొణికిసలాడుతున్నాయి. ఆకన్నిటి బిందువుల్లో ఎలక్ట్రిక్ లైట్లు ప్రతిఫలిస్తున్నాయి. సిల్కు రవికె ఎత్తుగా పొంపుతిరిగి నిగనిగలాడే చోట కన్నీటి చుక్కలతో తడిసింది.

"అమ్మా! భయంగావుందే...ఎందుకోగానీ!" అందామె.

తల్లి,తన చీరె చెరుగుతో కూతురి కన్నీళ్లు తుడుస్తూ, "పిచ్చిపిల్లా, భయమెందుకమ్మా! ఏం పర్వాలేదు...అల్లుడు మంచివాడేనమ్మా!..." అంది, ఇంకేదేదో చెప్పి ఓదార్చింది.

రాత్రి పదకొండింటికి, వధూవరులు కొగ్యం గదిలో తొలిసారి కలుసుకున్నారు—ఒకరు గాఢమైన అసక్తితో, ఒకరు భయంతో.

గది తెల్లని విద్యుద్దీపపు కాంతిలో ప్రకాశిస్తూంది. నలుమూలలూ చీకట్లు లేకండా స్పష్టంగా కన్పిస్తున్నాయి. పట్టెమంచం పక్కన బల్లమీద ఫలహారాల పళ్లెం ఎంత నోరూరిస్తున్నా త్రయంబకరావు భార్యవేపు అనురక్తితో చూడసాగాడు.

ఆమె ఇంకా ద్వారం దగ్గిరే తలొంచుకు నిలబడివుంది. ఆమె నిమ్మపండు వన్నె శరీరచ్ఛాయ కింకా మెరుగుపెట్టే గంధపు వర్ణం సిల్కుచీరె కట్టింది. రక్తవర్ణపు సిల్కు రవికె తొడిగింది. తలొంచుకుని—వొణుకుతోంది. త్రయంబకరావు ఆమె వేళ్ళనీ, కాళ్లనీ—బిగుతైన దుస్తులలోగుండా కన్పిస్తున్న యవ్వన శోభనీ, చూస్తున్నాడు.

మంచంమీద కూర్చున్నవాడల్లా కిందికి దిగాడు. అతని శరీరానికి పెద్దాపురం సిల్కు లాల్చీ, పంచె చాలా అనువుగా అమరాయి. మామూలుగా ఎల్లప్పుడూ వుండే ఆ అమాయకపు చిరునవ్వు అతని ముఖంలో మాసిపోలేదు. ఎందుకు అల్లా వొణుకుతున్నాయి ఆమె వేళ్ళు? మొహం పైకెత్తిందేం? కొన తేలిన గడ్డం, రవికె ఎరుపు నిగనిగల ముందు తెల్లగా కన్పిస్తోంది...

త్రయంబకరావు కిటికీగుండా బైటికి చూశాడు. రోడ్డుదీపం వెలుగులోగుండా, వర్షపు చినుకులు పడుతున్నాయి అందంగా. మబ్బుపట్టి అతి శీతలవాయువులు కిటికీగుండా లోపలికి దూసుకు వస్తున్నాయి. అవి అతనికి తెలియరాని ఏవో ఆవేశాల్ని కలిగిస్తున్నాయి.

అక్క చెప్పినమాటలు అతనికి మాటిమాటికీ జ్ఞాపకం వొస్తున్నాయి. అవును సున్నితంగా, జాగ్రత్తగా ప్రవర్తించాలి. అతను నిదానంగా కొంచెం ముందుకు నడిచాడు. జయ ఇంకా అలాగే నిశ్చలంగా నిలబడే వుంది.

త్రయంబకరావు పదినిమిషా లీవిధంగా చూసి మెల్లిగా నడిచి ఆమెను సమీపించాడు. దగ్గరకొచ్చి అడుగుదూరంలో ఆగి, "జయా" అని పిల్చాడు మెల్లిగా.

జయకి అతను తనవేపు వేస్తున్న ప్రతి అడుగూ, ఆ నిశ్శబ్ద వాతావరణంలో పదింతలు ధ్వనితో వినిపిస్తోంది. లావెండర్ వాసన గప్‌మని రాగానే, దాంతోపాటే 'జయా' అన్న పిలుపు వినపడగానే ఆమె తలెత్తి చూసింది, కొంచెం వోరగా.

ఆమె కళ్ళకి నారాల కుర్రాడిబావ జ్ఞాపకం వొచ్చాడు లీలగా. త్రయంబకరావు ఈ సమయంలోనే మెల్లిగా జయ దగ్గిరగావొచ్చి ఆమె చెయ్యి సున్నితంగా పట్టుకొన్నాడు.

జయకి అకస్మాత్తుగా గదిలో ప్రతివస్తువూ గిరగిరా తిరుగుతున్నట్టు అగుపించింది. త్రయంబకరావు పెరిగి పెరిగి భయంకరంగా గదినంతా ఆక్రమించుకున్నట్టు కనిపించాడు. అతని చిరునవ్వు వికటాట్టహాసంలా వినిపించింది. ఆమె కెవ్వున కేకేసి పడిపోయింది—తుపానులో చిక్కుకున్న అరటిచెట్టులా.



# అపస్వరాలు



త్రయంబకరావు బిత్తరపడిపోయినాడు. రెండు నిమిషాలు నిశ్చేష్టుడై నిలబడ్డాడు. తర్వాత ఆలోచించసాగాడు; ముందు ఆమెని ఎత్తుకెళ్ళి మంచంమీద పడుకోపెట్టాలని తోచింది; అట్లాగే వొంగి, అవలీలగా ఆమెని ఎత్తుకుపోయి మంచంమీద పడుకోపెట్టాడు. బయటకి వొచ్చి ఎవరితోనన్నా చెప్పాలనుకుని తొందర తొందరగా తలుపుతీశాడు. బైట గొళ్ళెం పెట్టారెవరో కొంటె ముత్తైదువలు గాబోలు.

అతనికి అందరికన్నా ఆప్తురాలు సలహాఇచ్చేదీ, అక్క రమణమ్మ. "అక్కా—అక్కా" అని నాలుగుమాట్లు కేకలేశాడు.

ఆమె ఎందుకైనా మంచిదని, చోటుచాలకా, కార్యం గది బైట చెంగుపర్చుకుని పడుకొనివుంది. మిగతావాళ్ళంతా అలసిపోయి వున్నారేమో, ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోతున్నారు. రమణమ్మ రెండో కేకకే లేచింది. లేచి—తలుపు దగ్గరకొచ్చి "ఏమిట్రా అది! ఎందుకట్లా పొలికేక పెడుతున్నావ్?" అంటూ బైటిగొళ్ళెం తీసింది.

త్రయంబకరావు, "అక్కా, ఏమిటే, నన్ను చూసీచూడ్డంతోనే అట్లా విరుచుకుపడిపోయింది? కళ్ళు తేలేసింది! నాకేమిటో దడగావుందే అక్కా" అన్నాడు, కంగారుగా.

"నీ మొహం, నీమూరా! కాసినిచన్నీళ్ళు మొహానచల్లి, నోట్లో గుక్కెడు, పాలుపొయ్యి. కాస్త తేరుకుంటుంది. కొత్తకద్రా బాజా! పెళ్ళయి ఎన్నాళ్ళకి కనపడక నేపోతివి. ఆరోజు కనపట్టం, మళ్ళీ ఇదేనాయె అది నిన్ను చూట్టం!—పద. పద. భయపడింది గావును చిన్నసన్నాసి!" అంటూ రమణమ్మ తానూ సందడేమీ చెయ్యకుండా లోపలికి వెళ్ళింది.

ఆమెవుద్దేశం, ఈవిషయం తల్లితండ్రులకి తెలుస్తే ఇదో వంక పెట్టి ఇంకా ఎన్నిమాటలైనా అంటారు; మరెన్ని పేచీలు పెడతారు అని.

త్రయంబకరావూ అక్క చెప్పినట్టే కాసినిచన్నీళ్ళు భార్య మొహాన చిలకరించి, రెండుగుక్కల వేడిపాలు, ఆమెనోట్లో పోశాడు. ఆమె తల తనతొడమీద పెట్టుకున్నాడు. రమణమ్మ ఈదృశ్యంచూసి ఎంతయినా జాలిపడింది; సంతోషించింది. ఈ పేచీలు అంతరించి తమ్ముడూ మరదలూ ఒకటవుతారా అని ఆమె చాలారోజులుగా ఎదురుచూసింది. ఆక్షణం ఆసన్నమైంది. కాని ఇదేమిటి, ఈ పాపఖర్మం!

"ఆమె నే వెళ్తున్నా రా! కొంచెంసేపుంటే తేరుకుంటుందిలే. చిన్నదికాదుట్రా! జాగర్త." అంటూ బైటికి వెళ్ళిపోయింది తలుపుదగ్గిరగా వేసి.

ఆమెవెళ్ళాక త్రయంబకరావు భార్యతల తొడమీదే పెట్టుకుని ఆమెకళ్ళు తెరిచిచూస్తోందో లేదో అని పరీక్షిస్తూ తల నిమురుతూ ఆమె ఎర్రనిపెదాల్ని బరువైన కనురెప్పల్ని, గుండ్రని అందమైన మొహంలోని అవ్యక్తమైన భయాందోళనల ఛాయల్ని చూస్తూ ముగ్ధుడౌతూ కూర్చున్నాడు. ఈమెని తనదిగా చేసుకోటంకోసం ఏమైనా చెయ్యొచ్చుననుకున్నాడు అతనాక్షణాన.

## 23

మంగళగిరి నరసింహస్వామి దేవాలయంలో అదే శ్రావణ బహుళపంచమినాడు సత్యానికీ రత్తమ్మకీ పెళ్లిముహూర్తం కుదిరింది. ఆ మొదటిరోజే సత్యం, రత్తమ్మ, సత్యం తల్లిదండ్రులూ, నలుగురు స్నేహితులూ, మంగళగిరి చేరుకున్నారు. అక్కడ దగ్గిర బంధువొకరున్నారు సత్యానికి. వాళ్ళింటిలో మకాంచేశా రందరూ. సత్యం రత్తమ్మ చాలా సన్నిహితంగానూ, స్వేచ్ఛగానూ మాట్లాడుకుంటున్నారు.

ఆవేళ సన్నని తుంపర పడుతూవుంది. ఆకాశం మబ్బులు కమ్మి, మంగళగిరి ఎండిపోయిన వాతావరణానికి ఎంతో జీవం పోస్తోంది. అక్కడక్కడ నీలాకాశం కన్పిస్తోంది. కొండమీద ఎండపొడ కన్పిస్తోంది.

సత్యం మకాం చేసిన ఇల్లు మెయిన్ రోడ్డుకి కొంచెం దూరంలో కుడివేపుగా వుంది. ఆ సందు కొంతదూరం ఎగువకి పోయి కొంతదూరం పల్లానికి దిగి విచిత్రంగా వుంటుంది. ఇల్లు మట్టిగోడలూ పూరికప్పూ. శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టారు. వాకిలిముందు నాలుగు బొంగులు పాతి చిన్న పందిరివేశారు. మేళం మోగుతోంది.

రత్తమ్మకి కాళ్ళకి పారాణి కళ్ళకి కాటుకా బుగ్గన చుక్కా పెట్టేసరికల్లా పెళ్ళికళ వొచ్చి—తగని సిగ్గూ వొచ్చేసింది. తన యీడుకి కొంచం పెద్దదైన పెళ్ళికొచ్చిన ఒకామె దగ్గిరచేరి తప్పించుకు తిరుగుతోంది. సత్యంగూడా పెళ్ళికొడుకు వేషంలో కొంత అలసినట్టుండి, సిగరెట్లు తగలేస్తూ స్నేహితులతో కలిసి పెద్ద బజార్న తిరుగుతున్నాడు.

బజార్లన్నీ ఎర్రమన్ను తడిసి రొచ్చురొచ్చుగా వున్నాయి. బెజవాడ సిమెంటురోడ్ల కలవాటుపడ్డ సత్యానికిది కొత్తగావుంది.

దేవాలయపు గాలిగోపురం ఎత్తుగా గంభీరంగా, కొండ పక్కనే మంగళగిరికే గర్వకారణంగా నిలిచివుంది.

సత్యం ఆరోజల్లా మర్నాటికోసం ఎదురు చూస్తున్నాడు సంతోషంగా. ఎంతో సన్నిహితంగా వున్నా ఇంకేదో తెర అడ్డువున్నట్టే ప్రవర్తిస్తోంది రత్తమ్మ ఇప్పటికివరకూ.

ఆమర్నాడూ వొచ్చింది. వాన లేదు; మబ్బులు మాత్రం విడలేదు. వాతావరణం బహుసుందరంగా వుంది. పచ్చని చెట్లూ, ఎటు చూసినా రోడ్లమీద ఖాళీస్థలాల్లో నిలిచివున్న నీళ్లల్లో ప్రతిబింబించే వెలుగులు.

సత్యం—రత్తమ్మ, ముహూర్తం వేళకి, బంధుసమేతంగా గుళ్ళోకెళ్లి పెళ్లి కార్యక్రమం పూర్తిచేసుకొచ్చారు.

గుడినీ—ఆవరణనీ, కొండెక్క మెట్లనీ, ఆశ్చర్యంగా చూస్తోంది రత్తమ్మ కళ్లు పెద్దవిచేసుకుని. కొండమీంచి కిందికి చూస్తే కనపడే పూరిదృశ్యం, ఆమె ఉల్లాసానికి వొక కారణమైనా, సత్యం పక్కనేవుండి, చేయీ చేయీ కలిపి కొంగూ చెంగూ ముడేసుకుని తలొంచుకు నడవటం మరింత ఆనందంగా వుంది. అసలే కొత్తచీర. దాని రంగు ముదురు ఆకుపచ్చ; కొంచం ముతకదైతేం, సత్యం మంగళగిరిలో తనకోసం పెళ్ళి కానుకగా కొనుక్కొచ్చాడు. దాని విలువ సిల్కులకైనా రాదు!

అసలా చీర కొంటానికి తానూ కొట్టుకెళ్లింది. కూరగాయలమ్మేదగ్గిర చిల్లరకొట్టుపక్కన వుందా చేనేతగుడ్డలషాపు. ఆషాపు యజమాని శుద్ధ ఖద్దరుగుడ్డలు ధరించి చాలా కలుపుగోలుతనంగానూ, విసుగు లేకుండానూ మాట్లాడాడు.

ఆమె చుట్టూ చూసింది. ఎన్ని రంగుల చీరెలు! ఎన్ని రంగుల నూలుకట్టలు! నెమలిపింఛంలా వుందా బీరువా! ఎరుపులోనే నాలుగైదు రకాలు. తనకు ఈ ముదురాకుపచ్చ నచ్చింది. నచ్చటం ఏమిటి? అసలా కొట్లో కెళ్ళేవరకూ తనకి అభిరుచి అంటూ ఒకటి లేదు; అక్కడికి వెళ్ళి ఆ రంగుల వైవిధ్యాన్ని చూసేసరికి, ఏది తీసుకోవాలో తెలియని సమస్యలో పడిపోయింది. అన్నీ బాగున్నట్టే తోచాయి ఆమె కళ్ళకి.

(49-వ పేజీ చూడండి)

# భయం!

ఆ సంగతి విన్నదగ్గర్నుంచీ రాజయ్య మనస్సు వికలమై — అలజడిలో కొట్టుకులాడనారంభించింది. ఏదో పనిమీద బయలుదేరిన ఆయన, గిరుక్కున వెనక్కు తిరిగి, గుండెమీద చేయి గట్టిగా పెట్టుకొని గబగబ నడిచి ఇంటికివొచ్చాడు. చిన్నమ్మాయిచేత గ్లాసుడు మంచినీళ్లు తెప్పించుకొని త్రాగినా ఆయన గుండెలో ఏర్పడిన దడ తగ్గలేదు —

వెంకటపతి రెండు రోజుల్లో విడుదల అవుతాడట!

వాడు విడుదలై వొస్తాడు! బోనులో పెట్టిన సింహం వాడు. తనమీద నిప్పులు కక్కుతో వుండివుంటాడు. ఎట్లా? ఏం చేసాడో ఏమిటో! కర్మ! వాడు జైలుకు పోవటానికి తనే కారణం! తనే స్వయంగా కేసు పెట్టింది. మరి అప్పుడు అంతకంటె గత్యంతరం లేకపోయింది. తనకి రామచంద్రయ్యకూడా బాగా వూతం ఇచ్చాడు కాని. ఇప్పుడు తను ఒక్కడే! తనకి ఊళ్లో పెద్ద అండలేదు. వాడు చేయబోయే దుర్మార్గాన్ని ఎదిరించే శక్తి తనకు లేదు. తనకి రెండువిధాలా చెడిన రేవడిగతి అయింది! ఇప్పుడు తను చెయ్యాల్సింది ఏమిటి?

వాడు జైలునుంచి కోరాలు మెరియాలు నూరుకుంటూ వస్తాడు. వాడి పగ త్రాచుపాము పగ. వాడు ఊళ్లో ఒక గొప్ప రౌడీ. వాడిక్రింద కొంతమంది రౌడీలు ఉన్నారు. వాడి నాయకత్వం క్రింద ఆ రౌడీలు ఏపని చేయటానికీ జంకరు. అసలు తను అప్పుడు వాడితో విరోధం ఎందుకు తెచ్చుకోవాలి?

తను బజారుతల ఇల్లు కొనటంచాత, తన ఇంటిప్రక్క కాళీస్థలముంటె అక్కడ కిల్లీదుకాణం పెటాడు, తనని అడగకుండానే! దుర్మార్గుల్ని ఇల్లిదగ్గర చేర్చడమా? తనకి మండుకొచ్చింది. వెంటనే రామచంద్రయ్య దగరకు వెళ్లాడు తను సలహాకోసం. ఆయన సలహాతీసుకొని వాడి దగ్గర కెళ్లి కొట్టుతీసివేయమని అధికారంగా అడగాడు. వాడు చాల తలబిరుసుగా మాట్లాడాడు. పైగా తను ఒకమాటంటే — తనమీద చేయిచేసుకున్నాడు. రామచంద్రయ్య వెంటనే పోలీసుల్ని తీసుకొచ్చి అక్కడ ఉన్నట్టుగానే వాడ్ని అరస్టు చేయించాడు. తను కోర్టులో జరిగింది జరిగినట్టు—తనమీద వాడు కర్రతో చేయి చేసుకున్నట్టు చెప్పాడు. ఆరు నెల్లు కఠిన శిక్షపడింది. అది రెండోసారి వాడు జైలుకు వెళ్లడం. అంతకు ముందు ఒకసారి ఒక దొంగతనం కేసులో జైలుకు వెళ్లి వచ్చాడట. వాడ్ని జైలుకు పంపించాక ఒక వ్యవహారంలో తనకీ రామచంద్రయ్యకూ చెడింది. తను ఇద్దరి మధ్యా విరోధం బలిసిపోయింది. ఆయన తనకి సహాయము చేసేదీ తను ఆయనకు సహాయపడేదీ ఏమీ లేదు. తను ఇద్దరూ కలిసి ఉండగా ఒక అండ ఉండేది; ఇప్పుడది లేదు. వెంకటపతి ఏం చేసినా తను సహించవలసిందే—!

**తాళ్లూరు నాగేశ్వరరావు**

వాడు తనని ఏం చేస్తాడు? ఏమైనా చేస్తాడు? తెగించినవాడికి హద్దూ అదుపూ ఏమిటి? వాడు చేసే దుర్మార్గపు పనులన్నీ తెగించి చేసినవే ఉంటాయి. ఎక్కడ లేని నిర్లక్ష్యం! తనంటే ఊళ్లోవాళ్లంతా దడవాలని వాడి కోర్కె! వాడి విగ్రహాన్ని చూసే పిల్లలు దడుచుకుంటారు. చింతనిప్పుల్లాగా కళ్లు ఎప్పుడూ వెలుగుతూవుంటాయి. వాడి రంగులచారల బనీనూ, తలగుడ్డా, మీసాల గంభీరతా, చేతిలోని లాఠీ— చూడటంతో అదోరకమైన భయం ఆవరిస్తుంది.

తను ఏదో ఒక ఉపాయం ఆలోచించి వాడి ఉపద్రవాన్నుంచి తప్పించుకుంటే తప్ప లాభం లేదు. వాడు తన రౌడీలచాత తనకు ఎంత అపకారమైనా తలపెట్ట చేయించవచ్చు! తను మాటమాటికి కోర్టులచుట్టూ, పోలీసు స్టేషన్ల చుట్టూ ఎట్లా తిరుగుతాడు? వాడు రౌడీలచాత చావిడి తగలబెట్టించవచ్చు! లేదా తనని చావ మోదించవచ్చు — వరికుప్పలు తగలబెట్టించవచ్చు! వాడి దుర్మార్గానికి ఎటువంటి నష్టాన్నీ పొందకుండా — ఏదో విధంగా వాడితో ముందుగా స్నేహం చేసుకుంటే! దుష్టునితో స్నేహమా? ఏం చేస్తాడు? దుర్మార్గుడితో స్నేహం చేస్తేనే బ్రతకగల రోజులు యివి! తను తప్పు ఒప్పుకొని — వాడిముఖాన కొంత డబ్బు పారేస్తే వాడే వస్తాడు తనవెంట కుక్కలాగా! తనకి ఇంక భయం ఉండదు. తనతో విరోధం పెట్టుకున్న ఆ రామచంద్రయ్యకూడా పల్లెత్తుమాట అనటానికి దమ్ములుండవు. వాడ్ని మెల్లగా దువ్వటమే తన పని. విరోధం పెట్టుకొనేకంటె — స్నేహం మీదనే దుర్మార్గులనుంచి బయటపడగలగొచ్చు.

అన్న అభిప్రాయానికి రాజయ్య వచ్చాడు. ఆయన కేవలం భయంలోనే అటువంటి అభిప్రాయానికి రావాల్సిన పరిస్థితి ఏర్పండిదని అనుకోవటంలో సమంజసం కానిది ఏమీ లేదు. కొన్ని భయాలకులోనై వ్యక్తి పరిస్థితుల వారసుడుగా మారటాన్ని మనం నిత్యమూ చూస్తున్నదే!

ఆ సాయంత్రం రాజయ్య వెంకటపతి ఇంటికేసి వెళ్లాడు. ఊరిచివర తాళ్లతోపులో ఉంది, వాడి ఇల్లు. రాజయ్య వెళ్లేసరికి — సూర్యుడు అస్తమించబోతున్నాడు. రాజయ్య చుట్ట పీల్చుకుంటూ, మధ్య మధ్య పొడిదగ్గు దగ్గుకుంటూ ఆ పాత పెంకుటిల్లు దగ్గరకు వెళ్లాడు. వెంకటపతి భార్య వెంకటసుబ్బి గేదెకు పచ్చిగడ్డి వేస్తోంది. రాజయ్యను చూసి ఆమె ముఖాన్ని కందగడ్డ చేసుకుంది తన మొగుడ్ని జైలుకు పంపించిన దుర్మార్గుడు రాజయ్య నన్న అక్కసు

 # భయం! 

ఆమెలో బాగా పాతుకొని ఉంది. ఆమె ముఖంలోని మార్పును రాజయ్య గ్రహించాడు కనుకనే తను సంభాషణ ఎట్లా ఆరంభించాలి? అన్న ప్రశ్న ఆయనకు ఎదురైంది కొంచెంసేపు దిక్కులుచూస్తూ గడిపాడు. కాని ఆమె మాట్లాడించలేదు ఇంట్లోకి వెళ్లింది, నిర్లక్ష్యంగా.

ఎట్లా తను ఈమెను మంచిచేసుకోవటం? ఈమెను మంచిచేసుకుంటేనే తప్ప-వెంకటపతిలో కలిగే ప్రశమకోపానికి కొంత అవరోధం ఏర్పడదు. తన తప్పును వెళ్లగక్కి-ఆమె ఎలాగైనా సరే, తనమీద ఉన్న ఆగ్రహాన్ని కనీసం కొంతైనా తగ్గించాలి. కొన్ని నిముషాలపాటు ఆలోచించాడు

మునిమాపు చీకటి ఆ తాళ్లతోపు మధ్య జడలు విరబోసుకుంది.

"వెంకటసుబ్బమ్మా!"

జవాబు లేదు ఆమెకు వినపడక కాదు.

"వెంకటసుబ్బమ్మా!" మళ్ళీ ఓపిక చేసికొని పిలిచాడు రాజయ్య ఈ తడవ ఆ పిలుపులో ఒకవిధమైన దీనత్వం తొణికిసలాడింది

వెంకటసుబ్బి బయటకొచ్చింది - తనను యింత మర్యాదగా పిలవటానికి గల కారణాల్ని కనుక్కోనేందుకు.

రాజయ్యవంక తీక్ష్ణంగా చూసింది ఇంటికి వొచ్చిన వ్యక్తిని కూర్చోమని అనలేదు. ఆమెలో ద్వేషం తల ఎత్తుకొని, హృదయంలో మంటల్ని రేపుతోంది రాజయ్య మట్టిఅరుగుమీద చతికెలపడ్డాడు.

"వెంకట సుబ్బమ్మా! నువ్వు నమ్మితావో నమ్మవో గానీ నాలో చాల మార్పు కలిగింది నేను వెంకటపతిపట్ల చేసిన తప్పును, ద్రోహాన్ని తెలుసుకొని కుమిలిపోతున్నాను. ఆ విషయాన్ని నీ ఎదుట చెప్పటానికి సిగ్గుపడుతున్నాను నీమొగుడ్ని జైలుకు పంపించటంలో నిజానికి పూర్తిగా నాదేం తప్పు లేదు. నన్ను ఆ పని చేయమని ప్రోత్సహించి, నాలో విషాన్ని ఎక్కించింది ఆ రామచంద్రయ్యే! నువ్వు ఏమైనా అనుకో - ఇప్పుడు నేను వెంకటపతికి చేసిన అన్యాయాన్ని గురించి చాల బాధపడుతున్నాను. ఎప్పుడు వొస్తాడు?"

"రెండు రోజుల్లో..."

"రాగానే నా తప్పు ఒప్పుకొని-క్షమించమని వేడుకుంటాను"

రాజయ్య మాటలకు వెంకట సుబ్బమ్మ హృదయం బంతిపువ్వు అయింది భర్త యొక్క విరోధులు ఇట్లా పశ్చాత్తాపం పడటం - ఒకవిధంలో ఆమెలో గర్వాన్ని రేపింది ఒక రైతు ఈవిధంగా తన ఇంటికి వొచ్చి 'క్షమాపణ' వేడుకుంటానని తనతో చెప్పడం ఆమెకు ఆనందాన్ని చేకూర్చింది ఆమెలోని ద్వేషం ఒక్కసారి అదృశ్యమై రాజయ్యమీద జాలితో కూడుకున్న దయ ఏర్పడింది.

"మీరు అట్లా అనటం ఏం బాగుండలేదు పెద్దవారు—" అన్నది వెంకటసుబ్బి వినయంగా.

"కాదు. ఉన్న విషయం చెప్పాను. వెంకటపతి వాస్తవానికి మంచివాడే. కాని అప్పుడు ఆ విషయాన్ని గుర్తించలేకపోయాను. రాను రాను నాకే తెలిసి వొచ్చింది - వెంకటపతిని జైలుకు పంపడం ఎంత బుద్ధితక్కువో! ఏంచేస్తాం? జరిగిపోయింది నేను ద్రోహం చేశానని - వెంకటపతికి నామీద గొంతుమట్టుకు కోపం ఉండొచ్చు. జరిగిన సంగతి చెప్పానుగా"

"పోనిలెండి, గడిచినదానికి!"

"గడిచినవాటిని నెమరకు తెచ్చుకుంటేనే ముందు జరగబోయేవాటికి జాగ్రత్త ఏర్పడేది ఒక విషయం అడుగుతాను దాచకుండా చెబుతావా అమ్మాయీ!"

వెంకటసుబ్బి ఆశ్చర్యంగా తల ఆడించింది.

"ఈమధ్య నీకు జరుగుబాటు కొస్త కష్టంగా జరుగుతూన్నదటగా! నిజమేనా?"

"అవును"

"నాకు తెలియనేలేదు నువ్వు మరోవిధంగా భావించకుండా ఉంటే, - కొంత డబ్బు సహాయం చేయాలని నాకు ఉంది. ఏమంటావు?"

"ఎంతవాట? మీబోటి ధర్మాత్ములకు అసుమంటి అభిప్రాయం కలిగినప్పుడు మేం కాదని ఎట్లా అంటాము?" గంభీరంగా అర్థించింది వెంకటసుబ్బి, తెలివంతా ఉపయోగించి.

రాజయ్య నవ్వుకున్నాడు జేబులోంచి రెండు పదిరూపాయల నోట్లుతీసి వెంకటసుబ్బిచేతి కిచ్చాడు

చీకటి బాగా చిక్కనయింది ఇంట్లో వెలిగించిన దీపం తాలూకు వెల్తురు బయట వాళ్లమీద చాల అస్పష్టంగా పడుతోంది.

"వెళ్లొస్తాను ఎప్పుడేనా జరుగుబాటు కానప్పుడు సహాయం చెయటానికి అజులుగా నేనున్నాను ఎల్లుండి వెంకటపతి వొచ్చినప్పుడు నేను వొచ్చిపోయానని చెప్పు. నాలో కలిగిన మార్పు, మా ఆయనమీద ఏర్పడిన అభిమానమూ - చెప్పు. వెళ్ళొస్తాను"

రాజయ్య అక్కణ్ణుంచి చీకట్లో ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ డబ్బును పెట్టెలో పెడుతూ - 'రాజయ్యలో ఇంత అకస్మా

త్తుగా మార్పు రావడానికి కారణమేమిటి?" అనుకుంది వెంకటసుబ్బి.

## 2

నరసింహయ్య కిళ్లీకొట్టు దగ్గర కూర్చుని వుంటే, జీతగాడిచాత సులేమాన్‌కి కబురు పంపించాడు రామచంద్రయ్య. వెంకటపతికి సాహసకృత్యాల్లో సహాయపడే నలుగురైదుగురు రౌడీల్లో సులేమాన్ ఒకడు. వాడిమీద వెంకటపతికి ఉన్న విశ్వాసం కూడా గణించతగ్గదే! తరచూ సులేమాన్ సలహాలుకూడా పాటిస్తూ వుంటాడు.

రామచంద్రయ్య తమ గురువును జైలుకు పంపించిన దుర్మార్గుల్లో ప్రథముడన్న సంగతి సులేమాన్‌కు తెలుసు. అంచాతనే ముందు ఆశ్చర్యపడ్డాడు! వెంకటపతి వొచ్చాక విరోధులమీద తగిన ప్రతీకారాన్ని చేయాలనే ఆలోచనకూడా వాళ్ళ అమల్లో ఉంది.

సులేమాన్ ఎక్కువసేపు ఆలోచించకుండా రామచంద్రయ్య దగ్గరకు వెళ్లాడు.

గత నాలుగైదు రోజుల్నించీ రామచంద్రయ్య హృదయంలో గొప్ప సంఘర్షణ జరుగుతో వొస్తోంది. తన విరోధి రాజయ్య నిన్న కనుచీకటి పడినాక వెంకటపతి ఇంటి దగ్గర్నించి తిరిగి వస్తున్నాడని జీతగాడు చెప్పగా విన్న దగ్గర్నించి - ఆయన హృదయంలోని సంఘర్షణ మరీ విపరీతమైంది. తన విరోధి అవతల మరో విరోధితో మంచిచేసుకుంటూ - బలపడ జూస్తున్నట్టు భావించాడు. తను ఇంక చేతులు ముడుచుకు కూర్చుని లాభంలేదు? ఆలసిస్తే - అవతల బలగం అధికమవుతుంది! రాజయ్య అసాధ్యుడు. తనతో విరోధం పెట్టుకొని తనని సాధించాలని యత్నిస్తున్నట్టు అగపడుతూంది! తనేనా అంత గాజులుతొడిగించుకున్నవాడు. తను పడవలసిన జాగ్రత్తలు తనూ పడతాడు!

వెంకటపతి దుర్మార్గుడు. దుర్మార్గుడితో మంచిగా ఉండటం సన్మార్గుడి పని. తను వాడితో మంచిగా ఉంటే, - తన కింక మరో భయంలేదు. ఈ ఊళ్లో వాడి అండ ఉన్నంతకాలం తనని నోరుఎత్తి అనేందుకుగానీ, తన శరీరంమీద మరొకడు చేయి వేసేందుకుగానీ, తన ఆస్తికి ఎటువంటి అపకారం జరగడంకానీ - సంభవించదు. వాడు గొప్ప రౌడీ. ఖూనీకోర్. దొంగ - అందుచేతనే వాడంటే చాలమందికి హడల్, కాని వాడ్ని జైలుకు పంపించటానికి తనూ ఆ రాజయ్యకు సహాయపడ్డాడు. కనుక వెంకటపతికి తనమీద కూడా అంతా కోపంతో నిండివుండవచ్చు. ముందు తన కర్తవ్యం - వాడిలో పెరుకుపోయిన ఆ కోపాన్ని తగ్గించటం.

ఎట్లా? తన తప్పు వొప్పుకొని - చాటుగా వాడి కాళ్ళమీద సాష్టాంగముగా పడటమే! అప్పటికీ దయ కలగకపోతుందీ - ఆ సులేమాన్‌గాడికి లంచమిచ్చి వాడిచాత చెప్పించటమే! వాడి మాటమీద వెంకటపతికి గురి వుందని చెప్పుకుంటూ వుంటారు అంతా. తను అప్పుడు అనవసరంగా శోక్యం కలిగించుకున్నాడు. మెదలకుండా వూరుకుంటే పోయేది. అయిపోయినదానికి అఘోరించి ఏం లాభం? ముందు తను సులేమాన్‌ని మచ్చిక చేసుకోవాలి.

రామచంద్రయ్యను చూడటంతో సులేమాన్ అలవాటు ప్రకారం సలాం చేశాడు. రామచంద్రయ్య ప్రతిగా మళ్ళీ చేశాడు.

"నాకీ రమ్మనివార్, ఎందుక్కా సాబ్!"

"ఇదుగో చూడు సులేమాన్! నిన్ను పిలవాలని ఎంతోకాలంనుంచీ అనుకుంటున్నాను."

"పిలిచారుగా సాబ్!"

"అవును నీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. నువ్వు నిజంగా నమ్ముతావో నమ్మవో గానీ - నాలో పెద్దమార్పు వొచ్చింది. ముఖ్యంగా అప్పుడు వెంకటపతిని జైలుకు ఎందుకు పంపించానా అని కుమిలి కుమిలి బాధపడుతున్నాను" గొంతు బొంగురు పోగొట్టుకుని నటించాడు రామచంద్రయ్య విచారాన్ని.

"ఇప్పుడూ యేమివొచ్చింది సాబ్"

"ఏంలేదు. నాలో కలిగిన మార్పును గురించి చెబుతున్నాను - అంతే! అప్పుడు ఆ రాజయ్య మాటలు నమ్మి - మీ వెంకటపతిని అన్యాయంగా జైల్లో పెట్టించాను. ఆరాజయ్య వొట్టి దుర్మార్గుడు. వాడిమాటలు నమ్మి వెంకటపతికి ద్రోహం తలపెట్టి, చేశాను. ఇప్పుడు ఆ తప్పుకు చెంపలు వాయించుకుంటున్నాను"

"మీకీ - అట్లా, కిందికీ జారిపోతావేం సాబ్!"

"ఇందులో జారిపోవడం ఏముంది? నిజం చెబుతున్నాను. మీ వెంకటపతి వొచ్చాక కాళ్లమీదపడి క్షమాపణ చెప్పుకోవాలని ఉంది. ఎప్పుడు వొస్తాడు సులేమాన్."

"రేప్పే -"

"ఆఁ! రేపేనా?"

"అవును సాబ్"

"..వెంకటపతి నా మీద, అంతా నావల్ల జరిగిందన్న అపోహతో - అమితమైన కోపాన్ని కలిగిఉండొచ్చు. నువ్వు కాస్త ఈవిషయంలో నాకు సహాయపడాలి. వెంకటపతిలో కలిగే ఆ కోపాన్ని నువ్వు ఉపశమింపజేయాలి. వేడెక్కిళ్ళకు చలనీళ్లు అడ్డుపడినట్టు - నువ్వు అడ్డుపడాలి సులేమాన్."

రామచంద్రయ్య భయానికి నవ్వుకున్నాడు సులేమాన్.

"నువ్వు అట్లా నవ్వుతే కాదు - నీకో పాతికరూపాయలు ఇస్తాను. ఈ విషయంలో నువ్వు తగిన శ్రద్ధ తీసికొని వెంకటపతికి నామీద దయకలిగేట్టు చూడు" దీనంగా అడిగాడు రామచంద్రయ్య సులేమాన్‌ను, భక్తుడు భగవంతుడికి తనమీద దయకలిగేట్టు చూడమని పూజార్ని అడిగినట్టు.

పాతికరూపాయలు ఇస్తాననేప్పటికి సులేమాన హృదయం కరిగింది.

"సరే సాబ్. మీకె ఇంతగా అడుగుతూ వుంటే, మాకీ సాయిపడక యాడికిపోతాం." అన్నాడు సులేమాన్.

వెంటనే రామచంద్రయ్య పాతిక రూపాయలు సులేమాన్ చేతిలో పెట్టి - గుండెమీద నిర్భయంగా చెయివేసుకున్నాడు. ఆ డబ్బు తీసుకొని సులేమాన్ భుజాలు ఎగరవేసుకుంటూ వెళ్లాడు.

ఆ సాయంకాలం సులేమాన్‌ను వెంటపెట్టుకొని - రామచంద్రయ్య వెంకటపతి ఇంటికి వెళ్లాడు. వెంకటసుబ్బి మర్యాదగానే పలకరించింది.

"వెంకటసుబ్బమ్మా! నీ మొగుణ్ణి జైలుకు పంపించినవాళ్ళల్లో నేనూ ఉన్నానని లోకం అంటుంది. కాని నేను ఆ రాజయ్య మాటలు నమ్మి మోసపోయాను. నాకు అసలు వెంకటపతిమీద ఎటువంటి కోపమూ లేదు. నీభర్త మంచితనం నాకు తెలియనిది కాదు. ఇప్పుడు బుద్ధ గడ్డితిన్నదని అఘోరిస్తున్నాను" అని



# భయం!



కొంచెలి విచారాన్ని అభినయించాడు రామచంద్రయ్య.

"అవునుఅమ్మా!" సులేమాన్ అందుకున్నాడు

"రేపు వస్తాడటగా! రాగానే క్షమాపణ చెప్పుకుంటాను"

వెంకటసుబ్బి గర్వపడ్డది. తన భర్త యొక్క గొప్పతనం ఏమిటో ఆమెకు అర్థమవుతోంది. విరోధులంతా చేతులుజోడించి తన ఇంటిచుట్టూ తిరగడం - ఆమెకు ఎక్కడలేని ఆనందాన్ని కలిగిస్తోంది.

"వెంకటసుబ్బమ్మా! నేను వెళ్లివస్తాను ఇదిగో! ఈ పాతికరూపాయలు ఉంచుకో! కుటుంబం జరగడం కొస్త కష్టంగా ఉందటగా! ఇట్లా ఎంతఇస్తేమటుకు వెంకటపతికి చేసిన ద్రోహానికి సరిపోతుంది. వెంకటపతి రాగానే నేను వొచ్చి ఇట్లా పశ్చాత్తాపపడ్డాననిమటుకు చెప్పు. వస్తాను రామచంద్రయ్య తేలికపడ్డ హృదయంతో బయటకొచ్చాడు.

ఆ పాతికరూపాయలను అలాగే చేతిలో పెట్టుకొని గుమ్మంలో నిలబడి - తాళ్లతోపులోంచి వెళ్లే రామచంద్రయ్య వంకచూస్తూ అలాగే నిలబడింది, వెంకటసుబ్బి.

## 3

వెంకటపతి ఊళ్లోకివొచ్చిన ఒక్క గంటలోనే దాదాపు ఆ ఊరంతటికీ తెలిసిపోయింది. చావళ్లోఉన్న రాజయ్యకు కూడా తెలిసింది. తెలిసినక్షణంనుంచీ అయనలో భయం తాలూకు ఛాయలు పూర్తిగా అగపడ నారంభించాయి.

ఎట్లాఉన్నాడో వెంకటపతి? తనవిషయం వాడిభార్య చెప్పిందో లేదో! చెప్పితే వాడు దానిమాట విన్నాడోలేడో! తన మీద చిందులు త్రొక్కుతున్నాడేమో! తనమీద పగ తీర్చుకోవాలని జైల్లోనుంచే ఆలోచించుకుంటూ వొచ్చాడేమో! ఏమిటి ఇప్పుడు తనుచేయడం? తనని వెంకటపతి ఏంచేస్తాడు? ఏంచేయాలని అనుకున్నాడు?

రాజయ్య ఎటూతోచక, హృదయానికి శాంతిని చేకూర్చలేక - వట్టినే భయపడుతో, ఇంట్లోకి చావట్లోకి పచార్లు చేయ నారంభించాడు. తలుచుకొన్న ఆయనలో విపరీతమైన ఆలోచనలు చెలరేగి, ఊపిర్ని నిలిపివేస్తున్నాయి గానీ - 'తనని వాడేం చేస్తాడు? అసలు ఒక వ్యక్తిని మరొక వ్యక్తి ఈ లోకంలో ఏం చేయగలు?' అన్న ధైర్యానికివొచ్చి, నరాలను అంటియున్న భయపు పొగల్ని తొలగించుకోలేక పోతున్నాడు.

ఆ సాయంత్రం రాజయ్య వీథిలోకి వచ్చేప్పటికి ఎదురూగ్గా ఇరవై మూప్ఫై గజాల్లో వెంకటపతీ, సులేమాన్ - ఎదురైయ్యారు. రాజయ్య వాళ్ళనుచూసి తప్పుకోలేక పోయాడు.

జైల్లో ఆరునెల్లు ఉన్నా వెంకటపతి చిక్కిపోలేదు; మనిషిలోని గాంభీర్యం తగ్గిపోలేదు. రాజయ్యను చూసి, మీసాలు దువ్వుకుంటూ గుర్రం సకిలించినట్టు ఇకిలించాడు వెంకటపతి రాజయ్య గుండెలు సగం అవిసిపోయినాయి. కాళ్ళక్రింద భూమి గజగజలాడింది; గాలి స్తంభించిన ఎండాకాలపు మిట్టమధ్యాహ్నంనాడు కిటికీలులేని గదిలో కూర్చుంటే చెమటపోసినట్టు, ఒక్కసారి ఆయన శరీరం మొత్తం స్వేదంలో నిండిపోయింది.

వెంకటపతి దగ్గరకొచ్చి—

"రాజయ్యగారూ! కులాసాయేనా?" అన్నాడు

రాజయ్య గొంతులోని తడి ఘనీభవించింది. గుడ్లు మిటకరించి వెంకటపతివంక పిచ్చిగా చూశాడు. ఆ చూపుకు సులేమాన్ కిసుక్కున నవ్వాడు. వెంకటపతి రాజీవితో కుడిచేత్తో మీసం దువ్వుకున్నాడు.

'వెంకటపతి కాళ్ళమీదపడి తన తప్పును క్షమించమని వేడుకుందామా?' అన్నంత దుఃఖం రాజయ్యలో పొంగుకొచ్చింది. కాని ఆ పనిని వెంకటపతే చేయనివ్వలేదు.

"రాజయ్యగారూ! భయపడకండి! మిమ్మల్ని నేను అర్థంచేసుకున్నాను. మీతో స్నేహంగా ఉండేందుకు నేనూ నిశ్చయించుకున్నాను" అన్నాడు వెంకటపతి.

రాజయ్య కళ్లల్లో కదులాడిన దుఃఖపు కన్నీళ్లు - ఆక్షణంలో ఆనంద బాష్పాలుగా మారినయ్.

"వెంకటపతీ! నేను చేసిన ద్రోహాన్నంతటిని మర్చిపో! ఇకనుంచీ కలిసిమెలసి ఉందాం. నువ్వు ఏ సహాయం చేయమంటే నేను ఆ సహాయం చేస్తాను నువ్వు ఇదివరకు పెట్టుకున్నట్టే మా ఇంటి ప్రక్కన బజార్లో మళ్ళీ కిల్లీదుకాణం పెట్టుకో! అది మంచి సెంటరు. ఇక నిన్ను అడ్డుపెట్టేవాళ్లు ఎవ్వరూ లేరు" అన్నాడు రాజయ్య.

వెంకటపతి ఆలోచనలో పడ్డాడు.

"అవునుభాయీ! కిల్లీకొట్టుపెట్టు రోజుకీ పదిరూపాయల బేరం కళ్లమాడవచ్చు!" అన్నాడు సులేమాన్.

"అట్లాగేలెండి, రాజయ్యగారూ!" వెంకటపతి కిల్లీకొట్టు పెట్టేందుకు అంగీకరించాడు

రాజయ్య హృదయం గమ్యస్థానానికి చేరుకున్న ప్రయాణికుని హృదయంలాగ సంపూర్ణమైన శాంతిని పొందింది. ఆఘనా మీసం దువ్వుకుంటూ ఇంటికి వెళ్లాడు.

రాజయ్య నిర్భయంగా మీసం దువ్వుకున్న విషయం రామచంద్రయ్యకు తెలిసింది అయనలో కలిగిన అలజడి వర్ణనాతీతం. అవతల విరోధి తనచుట్టూ ఉక్కుగోడ నిర్మించుకుంటూవుంటే-తను ముక్కు మూసికొని కూర్చుంటే ఏంప్రయోజనం? తనూ చేతివెనుక ఏనుగబలాన్ని ఏర్పరచుకొని - కాలుమీద కాలు వేసుకొని నిశ్చింతగా ఉండొచ్చు. రాజయ్య తనని ఏంచేస్తాడు? అయినా వెంకటపతితో ఎంత పొత్తు కలిపితేమటుకు - వెంకటపతి తనమీద దౌర్జన్యానికి తలపడతాడా? తను చేయవలసిన కట్టుదిట్టాలు తనూ ఇదివరకే చేశాడు. సులేమాన్ తన పక్షం, వెంకటపతి భార్య పాతికరూపాయలు తీసుకున్నందుకు వెంకటపతితో ఆమాత్రం తనమీద సదభిప్రాయాన్ని కలిగించలేకపోతుందా? అయినా తను వీళ్లని నమ్ముకొని కుక్కిన పేనులాగ మెదలకండా ఉండరాదు. తనూ వెంకటపతితో ముఖాముఖీ స్నేహాన్ని ఏర్పరచుకోవాలి.

ఆరాత్రి కనుచీకటి పడ్డాక సులేమాన్‌కు ప్రత్యేకంగా కబురుచేసి, వెంకటపతిని తన ఇంటికి రప్పించాడు రామచంద్రయ్య.

వెంకటపతిముందు సిగ్గూ, బిడియమూ లేకుండా తన హృదయాన్ని విప్పి అర చేతిలో పెట్టాడు రామచంద్రయ్య.

"వెంకటపతీ! నిన్ను జైలుకు పంపడంలో నే చేసిన పొరపాటు ఏమీలేదు. ఒకవేళ ఉన్నా అది ఆ రాజయ్య మోసపు మాటలకు నమ్మి చేసిందే. నిన్ను క్షమాపణ వేడుకోవాలని చాలా రోజుల్నుంచీ అనుకుంటున్నాను."

"మీరు అట్లా బాధ అయిపోతారేమండీ! మీలాంటి ఆసాములు నాకు క్షమాపణ చెప్పుకోవటమా? ఎవరేనా వింటే నవ్వి పోతారు. ఇంక ఎక్కడా యీమాట అనకోకండి! మీ చెప్పు చేతుల్లోవాళ్ళం." అన్నాడు వెంకటపతి.

ఆ చివరిమాటలోని అంతర్యం అర్థం చేసుకోనేందుకు రామచంద్రయ్య గింజుకున్నాడు. చివరకు తన మనస్సులోఉన్న అభిప్రాయాన్ని బయటపెట్టాడు.

"ఇదుగో చూడు వెంకటపతీ! రైల్వే ప్రక్కనూ చిన్న డాబాఉంది చూశావూ! అది ఇప్పుడు ఖాళీగానే ఉంటూన్నది. శుభ్రంగా అందులో చిన్న కాఫీహోటలు పెట్టుకో. మన ఊళ్లో సరైనహోటలూ ఒక్కటీలేదు. కావాలంటే నువ్వు అద్దె ఇవ్వనక్కరలేకుండానే వాడుకోవచ్చు. రాజయ్య ఇంటిప్రక్కన కిళ్ళీకొట్టంవల్ల నీకువచ్చే లాభాలు ఎక్కువ వుండవు."

ఆ ఆలోచన వెంకటపతికి బాగా నచ్చింది. కిళ్లీకొట్టంమీదకంటె ఎక్కువ ఆదాయం రావటానికి చాల అవకాశాలు ఉన్నాయి. తను కాఫీహోటలు పెట్టటమేమంచిది. తను కాఫీహోటలు తెరిస్తే ఈవూళ్లోవాళ్లు ఆకోమటి కొంటయ్య హోటలుకూ, గవుళ్ళ గరటయ్య హోటలుకూ ఎళ్ళటమా? కాని తను రామచంద్రయ్య డాబాలో హోటలు పెడితే – రాజయ్య క్రుంగిపోవచ్చు! రాజయ్య ఇంటి ప్రక్కన కిళ్లీకొట్టం పెడితే – రామచంద్రయ్య కుమిలిపోవచ్చు! ఏం చేయటం?

కాని ఇద్దర్ని సంతోషపెట్టటం తన ధర్మమని వెంకటపతి తలంచాడు. కనుక ఒక ఆలోచన తట్టింది. తను హోటలు తెరచి, కిళ్లీకొట్టుమీద తన బావమరిదైన నాగేశుని అట్టే పెట్టి, – తను పైన అజమాయిషీ చేస్తూంటే ఎంత బాగుంటుంది! ఆ ఆలోచన వెంకటపతికి బాగా నచ్చింది.

"సరే. రామచంద్రయ్యగారూ అలానే చేస్తాను, మీకూ అవసరమైనప్పుడల్లా కాఫీ

(47-వ పేజీ చూడుడు.)

"తెప్ప మీద చిన్నోడు..." —ఫోటో: కె. వి. ధర్మారెడ్డి, కర్నూలు.






# చైనా దేశపు వనితలు

మనదేశపు కొన్ని జాతులలో వరుడు వధువు తండ్రికి కట్నము చెల్లించి వివాహమాడే ఆచారము ఈనాటికీ ఉన్నది. పూర్వము విదేశాలలో కూడా ఈ ఆచారము ఉండేది. ఈ విధముగా ధనము చెల్లించి వివాహమాడిన పురుషుడు స్త్రీని ఒక గృహోపకరణము క్రింద భావించేవాడు. తనకామె బానిస అనుకునేవాడు. ఈ బానిసలు ధన వ్యయముతో లభించే జీవులు గనుక కోరినంతమందిని పురుషుడు వివాహమాడటానికి వీలు అయేది. ఈ విధముగా మించు మించుగా అన్ని దేశాలలోను బహుభార్యాత్వము ఒక సంప్రదాయ రూపము దాల్చింది.

చైనా దేశములో కూడా సరిగా స్త్రీల పరిస్థితి ఈ విధముగానే ఉండేది. తలిదండ్రులు యవ్వనవతులైన తమ కుమార్తెలను అమ్మి అప్పులు తీర్చుకునేవారు. సమయానికి తగినంత మొత్తము ఇవ్వగల వరుడు కనబడకపోతే వ్యభిచార గృహాలకు పిల్లలను అమ్మటముకూడా ఆచారముగా ఉండేది. చైనా స్త్రీలకు వివాహ స్వాతంత్ర్యము లేదు. విద్యా వైజ్ఞానికముగా అభివృద్ధి చెందటానికి స్త్రీలకు అవకాశాలు లేవు. ఆర్థిక స్వాతంత్ర్యము పేరుకయినా లేదు. అన్నిటికీ పురుషులమీద ఆధారపడవలసి వచ్చేది.

1949 వ సంవత్సరములో చైనా దేశములో విప్లవము వచ్చింది. దాని పర్యవసానముగా స్త్రీల పరిస్థితులలో అనేక మార్పులు జరిగాయి, ఆర్థిక స్వాతంత్ర్యము, పురుషునితో సమానమైన హక్కులు స్త్రీలకు సాంఘికముగా రాజకీయముగా లభించాయి. వివాహచట్టము 1950 మే ఒకటవ తేదీనుండి అమలులోకి వచ్చింది.

**ఇల్లిందల సరస్వతీదేవి**

దానివల్ల స్త్రీలకు సమాన హక్కులు లభించాయి. స్త్రీ తనకు తానే భర్తను ఎన్నుకోవచ్చు; విడాకులు ఇవ్వవచ్చు. బహుభార్యాత్వము నిషేధింపబడినది. స్త్రీలు ఉంపుడుకత్తెలుగా ఉండటము, వ్యభిచారవృత్తి నవలంబించటము శిక్షార్హములని శాసించబడ్డది.

భూసంస్కరణలచట్టము 1950 సంవత్సరములో అమలులోకి వచ్చింది. దీనివల్ల స్త్రీలకు పురుషులతోబాటు అన్ని పంపకములో సమానహక్కులు లభించాయి. స్త్రీ తన భూమిని ప్రత్యేకముగాగాని, ఉమ్మడిగాగాని వ్యవసాయము చేయించుకొనవచ్చును. స్త్రీలకు ఆర్థికముగా స్వాతంత్ర్యము లభించుటచేత లక్షలాది స్త్రీలు చైనా దేశములో భూవసతి కలవారయినారు. పట్నవాసపు స్త్రీలు ఉద్యోగాలలో ప్రవేశించటానికి అవకాశాలు కల్పింపబడ్డాయి. కర్మాగారాలలో, ప్రభుత్వ కార్యాలయాలలో, బస్సులలో పురుషులతోపాటు సమాన వేతనాలను పొందుతూ చైనా స్త్రీలు పనిచేస్తున్నారు.

స్త్రీలు ఉద్యోగాలు చేయవలెనంటే చేతిబిడ్డలకు తగిన వసతులు కల్పింపబడాలి. పనిచేస్తున్నంతసేపు తల్లిధ్యాస ఇంటిదగ్గర ఉన్న బిడ్డపైననే ఉంటే ఉద్యోగము సక్రమముగా జరగదు. ఈ విషయములో చైనా దేశము ముందడుగు. ప్రతి కార్యాలయమునకూ ఒక శిశు సంరక్షణాలయము అనుబంధముగా ఉంటుంది. పనిచేసే స్త్రీలు తమ బిడ్డలను శిశుసంరక్షణాలయములో వదలిపెట్టి నిశ్చింతగా పనులు చేసుకోవటానికి

విలుగా ఉంటుంది. గర్భిణీస్త్రీకి పురిటికి ముందు, తరువాత కూడా నిండు జీతముతో 56 దినాల సెలవు ఇవ్వబడుతుంది కాన్పు కష్టమయితే, మరి రెండు వారముల సెలవు అదనముగా ఇవ్వబడుతుంది. ఏ స్త్రీకయినా గర్భస్రావమయినటయితే ఒక నెల సెలవు లభిస్తుంది లేబరు ఇన్సూరెన్సునిధి నుండి కర్మాగారములో పనిచేసే స్త్రీకి బిడ్డపుట్టగానే ఎనిమిదిరూపాయల విలువగల నైనా నాణెములు ఇస్తారు పురిటిఖర్చు అధికారవర్గము వారే భరిస్తారు

శిశురక్షణాలయాలలో బిడ్డలకు కావలసిన ఆహారము సంరక్షణ ఉచితముగాలభిస్తాయి పూర్వము బిడ్డపుట్టగానే స్త్రీని పనిలో నుండి తొలగించేవారు; కాని ప్రస్తుతము పసిబిడ్డ తల్లులకే ఎక్కువగా అవకాశాలు కల్పింపబడ్డాయి

వ్యభిచార వృత్తిలో జీవితాలనుగడుపుతున్న స్త్రీలకు గౌరవముగా జీవించటానికి వీలయిన శిక్షణ యిస్తున్నారు స్త్రీలకు తమ యిష్టము వచ్చిన ఉద్యోగము చేయటానికి, సంఘసేవ చేయటానికీ స్వాతంత్ర్యము ఉన్నది ఆస్తి నిర్వహించటములో స్త్రీలకు భర్తతోపాటు సమాన హక్కులు కల్పింపబడ్డాయి

స్త్రీ తన వివాహమును రద్దుచేసుకోదలచినట్లయితే తనకా వివాహము అసమ్మతమని ప్రభుత్వమువారి ఎదుట వ్యక్తపరచవలసి ఉంటుంది. స్త్రీ గర్భవతిగా ఉన్నప్పుడుగాని, బిడ్డకు ఏడాది వయసుకు లోపల ఉన్నప్పుడుగాని భర్త ఆమెకు విడాకులు యివ్వటానికి వీలులేదు స్త్రీ తనయిష్టము వచ్చినట్లుగా పుట్టింటివారి ఇంటిపేరుతో వ్యవహరింప బడవచ్చు.

వివాహ చట్టములో బహుభార్యాత్వము ఉంపుడుకత్తెలను ఉంచుకొనుట నిషేధించటమే కాకుండా, వరకట్న నిషేధాలు, వితంతూద్వాహములు ప్రవేశపెట్టబడ్డాయి

ప్రస్తుతము చైనాదేశములో అన్నివిశ్వవిద్యాలయాలలోను స్త్రీలకు ప్రవేశమున్నది స్త్రీలు వైద్యురాండ్రుగా, ఇంజనీయర్లుగా శిక్షణ పొందుతున్నారు గనులలో తప్ప స్త్రీలు అన్ని రంగాలలోనూ పనిచేస్తున్నారు 1200 మంది సభ్యులుగల కాంగ్రెసులో 200 మంది స్త్రీ సభ్యురాండ్రు ఉన్నారు

చైనా స్త్రీలకు స్వాతంత్ర్యము కన్నుమూసి తెరచేఅంతలో లభించినదని గాని అనాయాసముగా లభించిందని గాని మనమనుకోగూడదు. సమరము సాగినిదే స్వాతంత్ర్యము లభించదు అడగనిదే అమ్మయినా పెట్టదుకదా!

దేశ సౌభాగ్యమును పెంపొందించటానికి ప్రభుత్వము అనేక ప్రణాళికలను సిద్ధము చేసింది ఆ ప్రణాళికలద్వారా ప్రభుత్వము ఏయేరంగాలలో ఎంతెంత సాధించదలచుకున్నదో అంతా సాధించిన తరువాతనే మేము సుఖమయ జీవితాలను గడుపుతామని ఆదేశపుస్త్రీలు శపథము చేశారు వ్యామోహాకరములైన, వేషభూషణాదులను విసర్జించారు. భోగయుతమైన జీవితాలలో నిరాడంబర విధానాలను అవలంబించారు

ఏ ప్రభుత్వము తమకు సమాన హక్కులను కల్పించి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించినదో, దానిపట్ల ఈ విధముగా తమ కృతజ్ఞతను వెల్లడించారు.

ఆల్ చైనా డెమోక్రాటిక్ విమెన్సు ఆర్గనైజేషను ప్రతి పల్లెలోను శాఖోపశాఖలుగా వెలసింది స్త్రీల అభ్యుదయమే దాని పరమ లక్ష్యము భర్తలు సైన్యములో చేరినట్లయితే భార్యలను ఈ సంఘము కాపాడుతుంది గర్భవతులకు బిడ్డలకువిషయములో కావలెనన్నా ఉచితవైద్య సౌకర్యాలను కల్పిస్తుంది కష్టపడి సాధించిన స్వాతంత్ర్యము సద్వినియోగమయేటట్లు చూస్తుంది.



వనితాలోకం :

# ఆమె - లోకం

**వాసిరెడ్డి సీతాదేవి**

ఉషాదేవి తన మేలిముసుగు కొంచెం తొలగించి పల్లెపాలెం ప్రజలను పలకరించింది. ఆమె ఆరక్తకపోలాల అరుణిమతో తూర్పుదిక్కున ఆకాశం రాగరంజితమైంది ఉత్తరాన రంయిన పరుగెత్తుకొస్తున్న కారుమబ్బులు, ఆ నీలాకాశాన్ని అలుముకొంటున్న అరుణిమను - ముత్తైదువు నొసటి కుంకుమను చెరిపే కబంధుని కఠోర హస్తంలా కప్పివేస్తున్నాయి! ఆకాశంలో ఏదో తెలియని వెలితి ద్యోతకమౌతూంది. ప్రపంచానికి వెలుగును ప్రసాదించే సూర్యభగవానుని, రాహువు తన చీకటి నీడల్ని పరచి, యింకొంచెం సేపట్లో మింగేయటానికి ఉద్యుక్తుడవుతున్నాడు.

ఊళ్లో అన్నిటికంటే ఎత్తుగా వున్న భవనం పైనున్న గూటిలోంచి ఓ కపోతాల జంటలేచి, గాలిలో 'టపటప' రెక్కలు ఆడించుకొంటూ రివ్వున ఆకాశంలోకి లేచిపోయినై.

ఆ భవనంలో మొదటి అంతస్తులో దక్షిణపు గదిముందు మాధవయ్య ఆందోళనగా అటూ యిటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ తిరుగుతున్నాడు. ఆయన ముఖంలో ఏదో వూహించలేని భయచిహ్నాలు, ఆనంద హాసరేఖలు, వొకదానిపై వొకటి గజిబిజిగా అలుముకుంటున్నాయి

గదిలోంచి మూలుగు వినిపిస్తోంది! ఎడంగా బల్లమీద కూర్చున్న పురోహితుడు త్రిపురయ్యగారి కళ్లలోకి మాధవయ్యగారు ఆదుర్దాగా చూశారు. పురోహితుడు చేతిలో పంచాగాన్ని తెరచిచూసి, గోడమీది గడియారంవైపు వోసారి చూసి అన్నాడు.—

"ఇప్పుడే సూర్యగ్రహణంపట్టింది! సూర్యభగవానుణ్ణి రాహువు మింగేశాడు!"

"ఇంకెంత సేపటికి?" దీర్ఘనిశ్వాసం [illegible]శాడు మాధవయ్య.

"ఇంకా ఏడునిముషాలకు సూర్యభగవానుడు విముక్తుడవుతాడు!" అన్నాడు పంచాంగం మడిచి పక్కన పెట్టుకుంటూ పురోహితుడు.

"దీక్షితుల దోషం." మాధవయ్య గొంతులో ఏదో అడ్డుపడింది.

"ఉంటే ఏం? దానికితగ్గ శాంతి లేదూ?" అన్నాడు త్రిపురయ్య ధీమాగా.

మాధవయ్య భయం, రాహువు సూర్యుణ్ణి మింగేసి తన కడుపులోనే పెట్టుకొని పారిపోతాడని కాదు. భార్య శాంతమ్మ గర్భస్థ శిశువు ఏ ప్రమాదం లేకుండా వెలుగును చూస్తుందా అని!

నుదుటిమీద స్వేదబిందువుల్ని పైపంచంతో అద్దుకుంటూ పట్టుతప్పిపోతున్న కాళ్లను నిలదొక్కుకుంటూ, హృదయస్పందనాన్ని అణుచుకుంటూ, గది ద్వారానికి దగ్గరగా వచ్చి నుంచున్నాడు.

పురిటింట్లోనుంచి 'గణగణ' వెండి పళ్లెం మోత వినపడింది.

'కేర్ కేర్' మని శిశు రోదనం!

మాధవయ్య హృదయం ఆనందపు వెల్లువయింది. అతని హృదయాంతరాళాల్లో చెలరేగిన గిలిగింతలు, మాధవయ్య ముఖంలోకి కొత్త వెలుగులను తెచ్చాయి.'

పురోహితుడు త్రిపురయ్య లేచి నుంచొని రెండు చేతులు పైకెత్తి నమస్కరించి మంత్రోచ్చారణ చేసి, మాధవయ్య వైపు తిరిగి అన్నాడు—"సూర్యభగవానుడికి విముక్తి కలిగింది!"

"అవును! విముక్తి కలిగింది" మాధవయ్య తేలికపడ్డ హృదయంతో అన్నాడు.

అవును! విముక్తి కలిగింది తన భార్య, బిడ్డ, గండం గడిచి బయటపడ్డారు - మనసులోనే అనుకున్నాడు మాధవయ్య.

పురిటిగది తలుపులు తెరచుకున్నై. వేడిగాలీ, వాసనా బయటికొచ్చినై.

మాధవయ్య మేనత్త బయటికొచ్చి అంది "ఒరే! మాధవుడూ! కూతురు పుట్టిందిరా, కూతురు! బంగారు బొమ్మ!"

మాధవయ్య ఆనందంతో పరవశుడైనాడు. ముగ్గురు మొగపిల్లల తరువాత ఆడపిల్ల పుట్టింది.

"అత్తయ్యా!" అన్నాడు ఆనందంతో వణికే గొంతుతో మాధవయ్య లోపల కెళ్లి భార్య ముఖంలోకి చూశాడు అలసివున్న ఆమె కళ్లలో, ముఖంలో ప్రశాంతత, పెదవులపై సిగ్గుతో కూడిన చిరునవ్వు తొణికిసలాడినై.

భార్య పక్కలోవున్న పసిబిడ్డను మాధవయ్య ఆప్యాయంగా చూసుకొన్నాడు.

* * *

మాధవయ్య దంపతులు కూతురుకు ఇరవై ఒకట్లో రోజున ఉయ్యాల కట్టి, 'జానకి' అని పేరు పెట్టుకున్నారు.

జానకి బారసాల బ్రహ్మాండంగా జరిపించాడు మాధవయ్య. దాదాపు ఓ వెయ్యి రూపాయలు ఖర్చు చేశాడు.

జానకికి జరగని ముద్దుముచ్చట లేదు. ఆమె అన్నలు కూడ ఆమెను ఎంతో ప్రేమగా చూసుకొనేవారు.

జానకి వయసుతోపాటు యింట్లో ఖర్చు కూడా పెరిగింది. ఊళ్లోకి వచ్చిన ప్రతి మంచి గుడ్డా కొని ముందు కూతురుకి కుట్టించేది శాంతమ్మ.

ఊళ్లోకి రామశాస్త్రిగారొచ్చి సంస్కృతం బడి పెడితే మాధవయ్య జానకిక్కూ సంస్కృతం చెప్పించాడు.

సంవత్సరం తిరక్కుముందే సంగీతం మాష్టరు చలపతి వూళ్ళోకి వచ్చాడు. ఆ సంగీతం మాష్టర్ని ఇంటికి పిలిపించి జానకిక్కూ సంగీతం చెప్పించింది తల్లి.

ఇలా జానకిక్కూ ఏ చదువూ పూర్తిగా వంటపట్టకపోయినా శాంతమ్మకి కూతుర్ని వూళ్లో ఆడపిల్లలందరికన్నా ముందు నిల్పోపెట్టిందన్న ఘనత దక్కింది!

చూస్తుండగానే యిట్టే కాలం దొర్లిపోయింది.

జానక్కి పద్ధానుగో సంవత్సరం వచ్చింది. పచ్చటి శరీరచ్ఛాయ, కోలమొహం, వెలుగులు చిందే విశాలమైన కళ్ళూ, తుమ్మెద బారుల్లా నల్లని నొక్కుల జుత్తూ, హాసరేఖలను పొదివి పట్టుకున్నట్లుండే ఆ పెదవులూ, యవ్వనపు మిసమిసల్ని మెరిపించే ఆ చెక్కిళ్ళూ, వయ్యారాన్ని వొలకబోసే ఆ నడకా...నిజంగా ఒక్కమాటలో చెప్పాలంటే జానకి ప్రబంధనాయికలా వుండేది

మాధవయ్య కూతురు పెండ్లి ప్రయత్నాలు చెయ్యసాగాడు. మంచి సంబంధం కోసం గాలింపు మొదలుపెట్టాడు.

అప్పటికే మాధవయ్య తన పెద్దకొడుక్కూ, రెండో కొడుక్కూ పెళ్లిళ్లు చేశాడు. పోతే మూడో కొడుకు యింకా పట్నంలో చదువుకుంటూనే వున్నాడు.

పెద్దకొడుకు సుబ్బారాయుడుకి ఇద్దరు పిల్లలు. రెండో కొడుకు రామదాసు పట్టి వెర్రివెంగళాయి. అయితే పెళ్లాం మాత్రం గడుసు మనిషి.

మాధవయ్య పెద్దకొడుకుల పెళ్ళిళ్లకూ, చిన్నకొడుకు చదువుకూ; కూతురు అచ్చట్లు ముచ్చట్లకు బాగా ఖర్చు చేశాడు నిలవ డబ్బు అయిపోవటమే కాకుండా, ఏడెనిమిది ఎకరాల పొలం, అమ్మటం కూడా జరిగింది. పోతే యిరవై ఎకరాల పొలం, ఆ యిల్లూ, కొద్దో గొప్పో అప్పూ మిగిలివున్నాయి

ఇంట్లో జానకి నగలకూ, గుడ్డలకూ వాటికి అయ్యే ఖర్చు చూసి కోడళ్లు సణగటం మొదలు పెట్టారు. కాని శాంతమ్మ యివి ఏవీ

ఖాతరు చేసేదికాదు. కూతురు విషయంలో మాధవయ్యకు శాంతమ్మ ఎంత చెప్పితే అంత. ఒక్కగానొక్క ఆడపిల్లాయె! అసలు కూతురు నడిస్తే కాళ్లెక్కడ అరిగిపోతయో అనుకొనేవాడు మాధవయ్య.

జానకి మాటకు ఆ యింట్లో ఎదురులేదు. ఆపూట కేవి కావాలన్నా అప్పటికప్పుడు ఇంట్లోకివచ్చి పడాల్సిందే.

"ఎంత. వుంటేమాత్రం ఇంత గారాబమా?" అంటూ యిరుగు పొరుగు అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకునేవారు.

ఇంటికోడళ్లు కాంతమ్మ, కమలమ్మలు యిక సరేసరి!

"ఈ చోద్యం భూమ్మీద ఎక్కడా చూడలేదమ్మ!" అంటూ గోజుతు నాలుగు పార్లన్నా జానకినిచూసి మెటికలు విరుచుకొనేవారు.

ఆరోజు సాయంకాలం కనుచీకటి పడుతోంది. మాధవయ్య అప్పుడు వూరినుంచి వచ్చి, వసారాలో మంచం వాల్చుకు కూర్చున్నాడు. భార్య శాంతమ్మ వుత్సాహంగా భ ను సమీపించి అన్నది.

"ఏ ం . ఏమయింది?"

"ఆఁ ఏమౌతుంది? తలకు మించినపని" అన్నాడు మాధవయ్య భార్యచేతి మంచినీళ్ళ గ్లాసును అందుకుంటూ.

"అంటే?"

"ఆఁ. అంతకట్నం మనం పోయలేం!"

మాధవయ్య గటగటా మంచినీళ్లు తాగి గ్లాసు కిందపెట్టి పైపంచతో ముఖం తుడుచుకున్నాడు.

"ఇంతకీ పిల్లడ్ని చూశారా?"

"ఆఁ చూశాను. పిల్లడికేం బ్రాగానే వుంటాడు."

"బియ్యే పాసయాడటగా?"

"అవును. బి. ఏ. ఏంఖర్మం. యీ సంవత్సరంతో యమ్ ఏ. కూడా పూర్తవుతుందట!"

"అయితే ఇంకేం? సంశయిస్తారెందుకూ? అమ్మాయిని అతనికే యిద్దాం!"

మౌనంగా భార్య ముఖంలోకి చూశాడు మాధవయ్య.

"ఇదిగో! చూడండీ! వాళ్లది జమీందారీ ఫాయాటగా? నిజమేనా?" ఇంతింత కళ్లు చేసుకొని అడిగింది శాంతమ్మ.

"అంతా నిజమేలే! కాని సెంటుభూమి లేదు. అతనిపేరున చదువుకుచేసిన కొద్దోగొప్పో అప్పుకూడ వుందని వినికిడి." అన్నాడు మాధవయ్య ఏదో ఆలోచిస్తూ.

"అంత చదువుకున్నాడుగదా? రేపు ఏ కలెక్టరో అయితే యీ అప్పొగిప్పో ఓ లెక్కా, జమా! చూడండీ! ఇంకో సంగతి. వాళ్లబంధువుల్లో వో ముసలమ్మ పదెకరాలకుపైగావున్న ఆస్తి యీ అబ్బాయికే యిస్తుందటగా?"

"ఇస్తుందటలే! కాని ఇప్పుడు పదివేల కట్నం మనం ఎక్కడ తెచ్చియిస్తాం?"

"పదివేలే!" గుడ్లు తేలేసింది శాంతమ్మ.

"సరే! నీళ్లుతోడు!" అన్నాడు మాధవయ్య చొక్కా విప్పుతూ.

తలుపుచాటుననించొని తల్లీతండ్రిసంభాషణ విన్న జానకిమనసులో—ఎం. ఏ. చదివి కలెక్టరు కాబోయే మొగుడూ, పదివేల కట్నం గజిబిజిగా యుద్ధం చేశాయి.

మాధవయ్యకు అన్నం వడ్డించి శాంతమ్మ వంటింటిగుమ్మానికి ఆనుకూర్చుని సంభాషణ ప్రారంభించింది.

"ఏమండీ! ఏమంటారూ?" అన్నది.

"ఏమిటి అనేది?"అన్నాడు మాధవయ్య.

"నాకు సుమ్మాటికే ఆసంబంధంనచ్చింది"

"నచ్చటానికేం! నాకూ నచ్చింది. కాని పదివేలు ఎక్కడ తెచ్చి...."

"ఉన్నదాంట్లోనే ఏ పదిమంది ఆడపిల్లలున్నారు గనక? వొక్కగానొక్క ఆడపిల! అయినా మీదంతా ఛాదస్తం! రేపు ఏ కలెక్టరో కాబోయేవాడు పదివేలు కట్నమన్నా తీసుకోకుండా పెళ్ళెట్లా చేసుకుంటాడేం?"

"అవును. ఆమాటా నిజమే"అనుకున్నాడు మాధవయ్య. "ఆరు నూరయినా నూరు ఆరయినా అమ్మాయిని ఆఅబ్బాయికి యివ్వాల్సిందే!" అంది శాంతమ్మ మొండిగా, భర్త కంచంలో మజ్జిగపోస్తూ.

"సరే, నీయిష్టం?" అన్నాడు మాధవయ్య.

"మనమ్మాయి అదృష్టవంతురాలు అన్నది శాంతమ్మ.

పడమటింట్లోనుంచి ఆ మాటలు విన్న జానకి ఆనందంతో వుక్కిరి బిక్కిరి అయింది.

వంటిల్లు సర్దటానికి వచ్చిన పెద్దకోడలు "పదివేలే? పదివేలు కట్నమా?" అని గుండెలు బాదుకుంది. వెంటనే ఆ వార్త తోటి కోడలు కమల చెవులో వూదింది.

ఆ రాత్రి కమల తన వెర్రిబాగుల భర్తకు నూరిపోసింది.

పెద్దకోడలు కాంతమ్మ ఆ వార్తయితే చెప్పింది కాని యింకేమీ అనలేక పోయింది. ఆవిడకు భర్తంటే చచ్చేభయం. పైగా సుబ్బారాయుడు తొణకని మనిషి. చెల్లెలంటే మహా యిష్టం.

మాధవయ్య ఐదెకరాల పొలం బేరం పెట్టాడు. ఇంట్లో కలకలం బైలుదేరింది. కోడళ్ళలో అలజడి సాగింది.

కొడుకులలో అశాంతి పొడచూపింది.

ఆ రాత్రి కాంతమ్మ అన్నం తినలేదు. పిల్లల్ని చావబాదింది. కొకిమీద పిల్లిమీద పెట్టి అ తిమూములను అడిపోసుకుంది.

రెండో కోడలు కమల తను తినలేదు సరిగదా భర్తకూడ అన్నం పెట్టలేదు.

"నా పిల్లలనోట్లో మట్టికొడతాడు మీ నాయన!" కసిగా అన్నది కాంతమ్మ. "నోర్ముయ్" అన్నాడు సుబ్బారాయుడు. అన్నాడే కాని అతని హృదయంలో కలిగిన అశాంతిని అణుచుకోలేక పోయాడు.

 ఆమె - లోకం 

"మీఅయ్య నిన్ను సన్యాసిని చేస్తాడు!" అన్నది కమల భర్తతో.

రామదాసు బిత్తరపోయాడు.

"ధైర్యంవుంటే నీది నువ్వు పంచియివ్వమని అడుగు!" మొగుడ్ని హెచ్చరించింది కమల.

"అడుగుతాలే" అన్నాడు రామదాసు.

జానకి పెళ్లి నిశ్చయమయింది. పొలం బేరం పైసలయింది. పొలం పోబోతున్న పెద్దకొడుకుని చూసి అన్నాడు తండ్రి.

"దస్తావేజుమీద సంతకం పెట్టాలి. మధ్యాన్నం రిజిష్టారాఫీసు దగ్గరకు రా." అని.

వినపడ్డా వినబడనట్టే సుబ్బారాయుడు అరకకట్టాడు.

"నీక్కేరా! చెప్పేది?" అన్నాడు తండ్రి.

"వస్తాలే!" సణిగాడు కొడుకు.

అన్నం తిని మహాలక్ష్మమ్మ చెట్టుకింద చీట్లపేక క్లబ్బుకు పోబోతున్న రామదాసుని చూసి అన్నాడు తండ్రి – "ఓరేయ్! నువ్వు కూడా మధ్యాన్నానికి ఆటురా!" అని.

"ఎందుకూ?" అన్నాడు రామదాసు, తిక్క శంకరయ్యలా ముఖం పెట్టి.

"ఎందు కేమిటిరా నీ మొహం! దస్తావేజుమీద సంతకం పెట్టాలి!" అన్నాడు తండ్రి.

"నేను పెట్టను. ముందు నాది నాకు పంచూ!" అన్నాడు వల్లించిన పాఠం అప్పచెబుతున్నట్లు.

తండ్రి విస్తుపోయాడు! తెల్లబోయి అరక ముందు అట్లాగే నిలబడిపోయాడు సుబ్బారాయుడు. కిటికీలోనుంచి చూస్తున్న కమల తన భర్త ప్రయోజకత్వానికి మురిసిపోయింది.

ఆ రోజే పట్నంనుంచి వచ్చిన మూడో కొడుకు సత్యం అరుగుమీద కూర్చొని జరుగుతున్నదంతా చూస్తున్నాడు.

"ఏమిటన్నయ్యా పంచేది? నీకు మరి మతిపోతూందా" అన్నాడు సత్యం.

"ఇల్లు ఇల్లూ దోచి పెడుతుంటే చూస్తూ కూర్చోమంటావేం? నీకు పెళ్లామా బిడ్డలా?" అన్నాడు రామదాసు కోపంగా.

సత్యం ఉద్రేకంతో లేచి నిల్చున్నాడు. తండ్రివంక చూస్తూ అన్నాడు. "అయితే పంచు నాన్నా, జానక్కీ కూడా ఒక భాగం. అదీ మాలాగనే పుట్టింది! ఆడవాళ్లకు ఆస్తిలో భాగం లేకపోవటం వల్లనే యీ కష్టాలు......"

"వూరుకో చిన్నన్నయ్యా!" అంది వాకిట్లోనించొని చూస్తోన్న జానకి.

అంతా వొక్కసారి జానకివైపు చూశారు. చెల్లాయి ముఖం చూసేప్పటికి రామదాసు మనసు వెన్నపూసలా కరిగిపోయింది.

"ఏవిటర్రా అదీ!" అంటూ తల్లి వచ్చింది.

"ఏం లేదులే అమ్మా! ఆఫీసుదగ్గరకేనా? వస్తాలే నాన్నా!" అంటూ రామదాసు గబగబ వెళ్ళిపోయాడు.

## 2

జానకి పెళ్ళియింది.

మాధవయ్య కూతురు పెళ్ళి చాలా పెద్దత్తునే చేశాడు. అల్లుడికి పదివేలు కట్నం యిచ్చాడు. ఇంకో ఐదారు వేలదాకా పెళ్లి ఖర్చులకయినై.

పెళ్లికి వచ్చినవాళ్లు వెంకట్రావును చూసి, అతని చదువూ వంశగౌరవం అంతా విని జానకి అదృష్టవంతురాలన్నారు.

"నా కూతురుకంటే అదృష్టవంతురాలెవరున్నారు?" అనుకుంది శాంతమ్మ.

శాంతమ్మ కోడళ్లు జానకి అదృష్టాన్ని చూసి ఈర్ష్యపడ్డారు. అప్పగింతలనాడు శాంతమ్మ జానకిని వెంకట్రావుచేతులో పెట్టి గోడుగోడున ఏడ్చింది. మాధవయ్య ఓమూల కూర్చుని పైపంచతో కళ్లొత్తుకున్నాడు.

భర్త చేయి పుచ్చుకొని గడపదాటిపోతూ జానకి తల్లిని కౌగలించుకుని బావురుమని ఏడ్చింది. తండ్రి కాళ్లకు చుట్టుకొని కన్నీటితో తడిపివేసింది. కూతుర్ని లేవదీస్తున్న ఆ తండ్రి హృదయం తరుక్కుపోయింది.

మాధవయ్య అల్లుడి కళ్లలోకి దీనంగా చూశాడు. ఆ చూపులతో – 'నా బిడ్డ భారంనీదే. నాచిట్టితల్లిని ఎలాచూస్తావో?' అని ప్రార్థించాడు. జన్మలో మాధవయ్య ఎవర్నీ అంతదీనంగా ప్రార్థించివుండడేమో!

కంటిరెప్పలా కాపాడి పెంచిన తల్లినీ, తండ్రినీ, అన్నయ్యనూ పుట్టి పెరిగిన యింటిని వదిలిపెట్టేబాధలో – తను సాగించబోయే కొత్త జీవితం – సంసారం – భర్తమీద అల్లుకొన్న చిన్నచిన్న చిలిపిపూహల ఆనందంలో మునిగి జానకి ఏ కలెక్టరు పెళ్లాన్నో అయ్యాననే ఆనందంతో అత్తవారింటికి వెళ్లింది.

## 3

జానకి జీవితం భర్తతో మొదటిసంవత్సరం ఆనందంగా గడిచిపోయింది.

ఏ కలెక్టరో అవుతాడనుకొన్న భర్త విశాఖపట్నంలో కాలేజీ లెక్చరర్ అయేసరికి జానక్కు కొంత నిస్పృహకలిగినమాట వాస్తవమే. కాని ఆ నిస్పృహ ఎంతోకాలం వుండలేదు.

చీకూ చింతా లేకుండా జానకి జీవితం విశాఖపట్నంలో హాయిగా గడిచిపోతూంది. వెంకట్రావుకు ఆమె అంటే ఎంతో ప్రేమ; ఆమెతోడిదేలోకం.

ఇంట్లో పనిమనుషులూ, వంటమనిషీ వున్నారు. జానక్కి కాలుకదపాల్సినఅవసరం లేదు. సాయంకాలం బీచి షికారు. వారానికి రెండురోజులు సినిమా. ఇంట్లో రేడియో.

అంతకంటే తనకు కావల్సిందేమిటి? నిజంగానే తను అదృష్టవంతురాలననుకుంది జానకి.

తల్లీ తండ్రీ అప్పుడప్పుడూవచ్చి చూసిపోతుండేవాళ్లు. కూతురిసంసారాన్ని చూసి సంతోషపడేవారు. జానికి ఇది తరుగు అన్నదిలేకుండా గడిచిపోతూంది.

ఒకరోజు రాత్రి జానకిభర్త చెవిలో వో చిలిపివార్త వూదింది.

వెంకట్రావుకి చక్కలిగింతలు పెట్టినట్లయింది. ఆనందపరవశత్వంతో జానకిని అమాంతం కౌగలించుకున్నాడు.

వెంకట్రావు తెల్లవారి మామకు వుత్తరం రాశాడు – జానక్కి మూడోనెల అని.

అనేకరకాలపండ్లు మిఠాయిలతో జానకి తల్లి విశాఖపట్నంవచ్చి వాలింది. రెండునెలలు కూతురుకు తోడుగా అక్కడేవుంది.

ఆరోనెల రాకముందే జానకిని తల్లి పుట్టింటికి తీసుకొచ్చింది.

జానకి ప్రసవించింది. ఆడపిల్లను కన్నది.

వెంకట్రావు భార్యను, పిల్లను చూట్టానికొచ్చాడు. కూతుర్ని చూసి సంబరపడ్డాడు.

జానకి భర్తముఖంలోకి దిగులుగా చూస్తూ అంది – "బాగా చిక్కిపోయారు. వంట్లో బాగుండటం లేదా? హోటలుభోజనం పడటంలేదా?" అని.

నవ్వేసి వూరుకున్నాడు వెంకట్రావు.

పుట్టింట్లోవున్న జానకికి భర్తనుగురించే దిగులు పెట్టుకుంది. మూడోనెలరాగానే బిడ్డనెత్తుకొని విశాఖపట్నం వెళ్లింది. తండ్రి కూడావచ్చి కూతుర్ని అల్లుడింట్లో దిగబెట్టి వెళ్లిపోయాడు.

ఆరునెలలు గడిచిపోయినై.

జానకి కూతురు తప్పటడుగులేస్తూ, పడుతూ లేస్తూ లేచి నించోటం మొదలుపెట్టింది.

వెంకట్రావు ఎప్పుడూ ఆ కూతుర్ని భుజంమీదనుంచి దించేవాడు కాదు. ఆ కూతురుమీదే అన్ని ఆశలూ, మనుకోరాలు పెట్టుకున్నట్లుండేవాడు.

"మా పార్వతిని బాగా చదివించి డాక్టరమ్మను చేస్తాను." అంటూ కూతుర్ని చాతీపైన దొర్లించుకునేవాడు.

ఇది వింటున్న జానకి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మురిసిపోయేది.

వెంకట్రావు ఆరోగ్యం క్షీణించటం మొదలుపెట్టింది. చిక్కి శల్యమైపోతున్నాడు. అప్పుడప్పుడు రాత్రిళ్లు కళ్లుకళ్లున దగ్గుకూడ వస్తోంది.

"ఏవండీ! అలా చూస్తూ వూరుకుంటే ఎలా? ఎవరికైనా మంచి డాక్టరుకు చూపించకూడదూ?" అన్నది జానకి భర్తతో.

వెంకట్రావును పరీక్షచేసి డాక్టరు ఎక్స్-రే తీయాలన్నాడు. పరీక్షచేసి అన్నాడు డాక్టరు:- "ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. వ్యాధి బాగా ముదిరిపోయింది. ఆరునెల్లపాటు విశ్రాంతి తీసుకోవాలి."

ఆదుర్దాగా వెంకట్రావు డాక్టరు కళ్లలోకి చూశాడు. డాక్టరు క్షయవ్యాధి అని నిర్ధారణచేసి చెప్పాడు.



# సింహాచల దేవాలయ శిల్పకళాసౌందర్యం



ఫోటోలు : ఆ. సత్యనారాయణ — విశాఖపట్నం.

జానకి కాళ్ళకింద భూమి కదులుతున్నట్లయింది. భర్తను కౌగలించుకొని భోరున ఏడ్చింది. వెంకట్రావు కుమిలి కుమిలి ఏడ్చాడు.

జానకి తండ్రికి వుత్తరం రాసింది.

"మీ అల్లుడికి. ఏం రాయమంటారు. చేతులు వణుకుతున్నాయి నాన్నా! అమ్మను తీసుకుని వోసారి రండి!"

మూడోరోజుకల్లా మాధవయ్య భార్యతో సహా విశాఖపట్నం వచ్చిపడ్డారు ఆదుర్దాగా.

అల్లుడి వ్యాధివిషయం విని మాధవయ్య స్తంభించిపోయాడు. శాంతమ్మ కూతుర్ని కౌగిలించుకొని పెద్దపెట్టున ఏడ్చింది.

అప్పటికే వెంకట్రావు తరఫు బలగమంతా వచ్చి దిగారు. జానకి పెద్దన్న సుబ్బారాయుడు వచ్చి చెల్లెల్ని పలకరించి వెళ్లాడు.

చిన్నన్న సత్యం అంటే జానకి అమితప్రేమ. సత్యమూ జానకంటే అలాగే వుండేవాడు. అతనికి వుత్తరం రాయాలంటే అతని జాడే తెలియదు. చదువు మానేసి రాజకీయాల్లో తిరుగుతున్నాడని తెలిసింది.

వెంకట్రావుకు జబ్బు వచ్చిన తరువాత మూడు నెలల్లో, మందులకూ మాకులకూ, డాక్టర్లకూ, ఇంట్లో వచ్చిపోయేవాళ్లకూ, ఎంత ఖర్చు అయిందో చెప్పటానికి వీల్లేదు.

శాంతమ్మ తన పెద్దగొలుసు అమ్మి రహస్యంగా అల్లుడిచేతి కిచ్చింది.

వెంకట్రావుని గాలిమార్పుకు మదనపల్లి తీసుకు వెళ్లమన్నారు డాక్టర్లు.

"తొందర్లో మదనపల్లి వెళితే మంచిది కాదండీ?" అన్నది జానకి భర్తతో.

"మంచిదే కాని డబ్బెది? చాలా కావాలి" అన్నాడు వెంకట్రావు.

ఆమాటే జానకి తల్లితో అన్నది.

శాంతమ్మ భర్తను కదిలించింది.

మాధవయ్య ఆ సాయంకాలమే యింటికి ప్రయాణమైపోయాడు.

## 4

"ఏరా!" అన్నాడు మాధవయ్య.

"నా దగ్గరెక్కడిదండి?" అన్నాడు పెద్దకొడుకు సుబ్బారాయుడు.

"నా కొప్పుదా?సే" మాధవయ్య కోపంగా అన్నాడు.

"నీ కొచ్చేది యింతవరకు అనుభవిస్తున్నావుగా!" అన్నాడు చిన్నకొడుకు, రామదాసు.

"అంతేనా?" నిర్ఘాంతపోయాడు తండ్రి. తన కొడుకులు తన [illegible] గారు!

"అయితే, ఆ మూడ్చు పొలం ఎకరం బాతిక అమ్మకో. మిగతది ఎవరిది వారికి తెగతెంపులు చెయి" అన్నాడు పెద్దకొడుకు.

మాధవయ్య కొడుకులకు భాగాలు పంచాడు. తన భాగంగా మాధవయ్య వో యకరం బాతిక మాగాణి మాత్రం తీసుకున్నాడు.

పొలం అమ్మి డబ్బు తీసుకెళ్ళి కూతురు చేతిలో పోశాడు మాధవయ్య.

వెంకట్రావు మదనపల్లి ప్రయాణమయారు. జానకి, మాధవయ్య, శాంతమ్మలు వెంకట్రావును శానిటోరియంలో చేర్చి యింటికి బయలుదేరారు.

జానకి చంకలోని పసిపాప 'నాన్నా.' అంటూ చేతులు చాపింది.

కూతుర్ని చేతుల్లోకి తీసుకొని జలజలా అశ్రువులు రాల్చాడు వెంకట్రావు.

"నా చిట్టితల్లీ! నిన్ను డాక్టర్ చేయాలనుకున్నానమ్మా!" అన్నాడు.

జానకి వలవలా ఏడ్చింది. "ముందు మీరు బాగా నయం చేసుకోండి! తరువాత అమ్మాయిని డాక్టరు చేద్దురుగాని" అన్నది జానకి.

జానకి భర్తను వదిలి వచ్చేప్పుడు దారి పొడుగునా కుమిలి కుమిలి ఏడ్చింది. జానకి కూతురితో పుట్టింటికి చేరింది.

మాధవయ్య కుటుంబ పరిస్థితులు మారాయి. జానక్కు ఆ యింట్లో యిదివరకున్న స్థానం యిప్పుడు లేదు. ఆ మాట కొస్తే మాధవయ్యకే లేదు.

ఇంట్లో పెత్తనం పెద్దకోడలు కాంతమ్మదే. సుబ్బారాయుడు పళ్లబిగువుమీద భార్యను అదుపులో పెట్టే రోజులు పోయినై.

అల్లుడికివ్వగా మిగిలిన డబ్బుతో మాధవయ్య సంసారాన్ని లాక్కొస్తున్నాడు.

జానకి భర్త ఆరోగ్యం నయమవుతుందనే కొండంత ఆశ పెట్టుకొని కాలం దొర్లించుకొస్తోంది. తొందర్లో నయమయివస్తాడు, మళ్ళీ వుద్యోగంలో ప్రవేశిస్తే హాయిగా విశాఖపట్నంలో వుండవచ్చు. కూతురికి చదువుకొచ్చే యీడొచ్చేసరికి వాళ్ళ నాన్న ఆరోగ్యం పూర్తిగా బాగుపడుతుంది. ఆయనే కూతుర్ని చదివించుకుంటాడు.

నిత్యం యిలాంటి ఆలోచనలతోనే కాలం గడుపుతుంది జానకి.

సంవత్సరన్నర గడిచింది. కష్టాలు చెప్పిరావు. వచ్చాక వాటికి అంతూ పంతూ వుండవు.

మదనపల్లినుండి టెలిగ్రాం వచ్చింది!

జానకి జీవితజ్యోతి ఆరిపోయింది! నొసటి కుంకుమ రాలిపోయింది! ఆమె ఐదోతనం మంటగలసింది!!

వెంకట్రావు మరణవార్త విన్న జానకి మొదలు నరికిన తరువులాగ పడిపోయింది! పెనవేసుకున్న వృక్షాన్నుండి విడదీసిన లతలాగ జానకి ప్రాణం రెపరెపలాడింది.

"అయ్యో! పాపం! జానకి!!" అన్నది లోకం.

జానకి తలిదండ్రుల దుఃఖానికి అంతు లేదు. మాతృహృదయంలోని రంపపుకోతను ఎన్ని కన్నీళ్లయినా తెలియ చెప్పలేవు.

వెంకట్రావు బంధుబలగం, జ్ఞాతులు అతని ఆత్మనిగురించి ఆలోచించారు. బతికుండగా ఒక్కళ్లూ సహాయం చేసినపాపాన పోలేదు. తల్లిదండ్రులు చిన్నప్పుడే దూరమైనారు.

వెంకట్రావుకు ఆస్తి యిస్తానన్న ముసలమ్మ యింకా రాయిలా బతికేవుంది. వెంకట్రావు కర్మకు ఖర్చు తనే పెట్టుకుంటానంది. బతికుండగా ఒక్క దమ్మిడీ యివ్వలేదు. ముసల్ది తొందరపడి ఆస్తి యివ్వనందుకు తనను తనే మెచ్చుకుంది. అప్పుడే తనకు నీళ్లు వదలటానికి అర్హుడైన ఒక వారసునకు ఆశ పెట్టింది.

వెంకట్రావు పెదనాన్న మాధవయ్యకు కబురు పెట్టాడు కర్మ వెంకట్రావు సొంత వూరులో జరుగుతుందని.

కూతుర్ని తీసుకొని మాధవయ్య దంపతులు బయలుదేరారు.

మెల్లగా ఒక్కొక్కళ్లే బంధువులు, జ్ఞాతులు అంతా చేరుకున్నారు.

కర్మ పదిరోజులూ, శాస్త్రోక్తంగా జరిపించాడు వెంకట్రావు పెదనాన్న.

పదోరోజు! అదే జానకి ఐదోతనానికి ఆఖరురోజు — గులాబీవన్నె చీరకట్టి జానకిని సావిట్లో కూర్చోపెట్టారు. నొసటిమీద 'కాని' అంత కుంకుమబొట్టు, చేతినిండా గాజులు, నున్నటి పచ్చటి మెడలో మెరుస్తున్న మాంగల్యం — ఆరిపోబోయే — ఆమె ఐదవతనం, ఆజ్యంపోసిన అగ్నిలా మెరుస్తోంది!

అలసిపోయిన ఆమె ముఖం ఏదో చెప్పలవికాని కాంతి విషాదచ్ఛాయలను ప్రసరిస్తోంది.

శాంతమ్మ కూతుర్ని వళ్లో కూర్చోపెట్టుకొని గోడుగోడున ఏడుస్తోంది. జానకి చెక్కిళ్లపైన అశ్రువులు ధారాపాతంగా ప్రవహిస్తున్నాయి.

వూళ్లోనుంచి ముత్తయిదువులంతా ఒక్కొక్కళ్లేవచ్చి చూసిపోతున్నారు. ఒక్కొక్కమ్మా వచ్చినప్పుడల్లా సావిట్లోనుంచి పెదపెట్టున శోకాలు హాల్లోకూర్చున్న మగవాళ్ళకు వినవస్తున్నాయి.

"ఆ వచ్చే ఆడవాళ్ళంతా ఒకసారివస్తే పోలా?" అనుకున్నాడు వో ముసలాయన, దుమ్ముపట్టిన లంకపొగాకు చుట్ట కాలక అవస్థ పడుతూ.

చీకటి పడుతోంది.

"అమ్మా చీకటి పడుతోందే!" అంటూ జానకి తల్లిఒడిలో తలదూర్చి ఆక్రోశించింది.

రాత్రి తొమ్మిదిగంట లవుతుంది. చూడవలసిన బంధువులంతా ఆఖరిముత్తయిదువు చూపును అందుకున్నారు.

ఇంకా కొన్ని గంటల్లో-జానకిమాంగల్యం మట్టెగలుస్తుంది. నొసటికుంకుమ చెరుగుతుంది. గాజులు ఘల్లున నేలరాల్తాయి. వన్నెచిన్నెలపువ్వుల చీరెలు దూరమౌతాయి. తుమ్మెదబారల్లావుండే అనొక్కులజుట్టులో యిక పూలుపెట్టుకొనే యోగ్యతలేదు.

ఎక్కడినించో జానకి చిన్నఅన్న సత్యం ఒకస్నేహితునితో కలిసి అప్పుడే వచ్చాడు.

చిన్నఅన్నయ్యనుచూసి జానకి భోరున ఏడ్చింది. సత్యం మనస్సు కకావికలయింది. చెల్లెలి దురవస్థచూసి ముఖానికి చేతులు అడ్డం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు.

రాత్రి పదిగంట లవుతోంది. పెదలంతా మధ్యహాల్లో మౌనంగా కూర్చున్నారు.

"ఏమిటోయ్ సత్యం! అంత చిన్న వయసులో వున్న ఆ అమ్మాయికి యీ ప్రారబ్ధం! యీ తతంగమంతా ఏమిటి?" అన్నాడు సత్యం స్నేహితుడు రామారావు.

# ★ ఆమె - లోకం ★

పెద్దలంతా విస్తుపోయి, కనురెప్పలు ఎత్తి చేసి రామారావుకేసి చూశారు.

"అనాదినుంచీ వస్తూన్న ఆచారం నాయనా! శాస్త్రాన్ని ధిక్కరించగలమా?" అన్నాడు వయోవృద్ధుడు, సనాతన ధర్మ పరాయణుడూ ఐన శివయ్యగారు.

"కాలం మారింది తాతగారూ! పోయిన వాళ్లే చిహ్నంగా బతికివున్న వాళ్లకి నరకాన్ని శాసించే మతసిద్ధాంతాల్ని ఎదిరించకపోతే ఎట్లా తాతగారూ?"

అంతా నిశ్శబ్దంగా వాళ్లే వాదన వింటున్నారు. "అది కాదు నాయనా! స్త్రీకి వివాహితనం భర్తవల్ల సంక్రమించేదే కదూ? ఆ భర్తపోయాక యింకా వివాహితనం వుండాలనటంలో అర్థం లేదు. ఆ భర్తతో పాటే అదీ పోవద్దూ? ఏమంటావు?" అన్నారు శివయ్యగారు.

"ఇంకా నయం భార్యకూడ పోవాలన్నారు గారు! కొంతకాలం క్రిందట అదీ వుండనుకోండి! ఏదీ యిప్పుడలా జరుగుతోందా? మీ వాదనప్రకారం చూసినా స్త్రీకి వివాహంద్వారా వచ్చింది ఆ ఒక్క మాంగల్యాన్ని ధరించే హక్కేగదూ? పసుపూ కుంకుమా, పువ్వులూ చీరెలూ ధరించే హక్కు స్త్రీకి పుట్టుకవల్ల వచ్చింది కాదా?"

శివయ్య తాతగారికి కోపం వచ్చింది.

"మీ నాస్తికులతో వాదించి ప్రయోజనం లేదు" అన్నారు తాతగారు.

నవ్వి వూరుకున్నాడు రామారావు.

సత్యం వీధి అరుగుమీద కూర్చున్న పెద్దన్నయ్య దగ్గరకుపోయి అన్నాడు: "ఏమిటన్నయ్యా! నాన్నకు తెలియకపోతే నీకు తెలియలేదా? ఏమిటి తతంగమంతాను? అసలు అమ్మాయిని యిక్కడ కెందుకు తీసుకొచ్చారు?"

"నాకేం తెలుసురా? పెద్దవాడు అయనే చూసుకున్నాడు. అంతేను." పైపంచ దులుపుకుంటూ అన్నాడు సుబ్బారాయుడు.

తెల్లవారుఝాము. నాలుగు గంటలవుతుంది. కారుమబ్బుల్లోనుంచి నక్షత్రాలు తొంగిచూస్తున్నాయి. దూరంగా కుక్కల ఏడ్పు వినిపిస్తోంది.

హృదయాన్ని చిల్లులు పొడిచే రోదన ఒక్కసారిగా విన్పించింది. స్త్రీ హృదయాన్ని బద్దలు చేసుకుంటూ వస్తున్న ఆ రోదనలో - స్త్రీ తన సౌందర్యాన్ని, కాంతిని శాశ్వతంగా దూరమౌతూన్నప్పుడు పొందే దుఃఖం బాధా యిమిడివున్నాయి! ఆ స్త్రీ రోదన వింటే లక్షలాది మానవులు ఎగురుతారు. బహుశా అందుకే ఆ తంతు రాత్రిపూట జరుగుతుందేమో!

జానకిని బండి ఎక్కించి వూరిబయటి చెరువుదగ్గరకు తీసుకెళ్లారు.

* * *

కర్మకాండ అంతా అయాక జానకిని తీసుకొని మాధవయ్య దంపతులు సొంత వూరు వచ్చారు.

ఒకప్పుడు శ్రీలక్ష్మిలా యిల్లంతా కలయ తిరిగిన జానకి విధవై, ముసుగుపంచ కట్టుకొని యింట్లో మూలకూర్చుంది. కాంతమ్మ కూతుర్ని గురించిన దిగులుతో మంచ మెక్కింది.

పాపం! మాధవయ్య, జానకమ్మలకు కష్టాలు కొండమీదనుంచి దొర్లే రాళ్లలా ఆరంభమయినాయి.

## 5

భూమి గిరగిరా తిరుగుతూనే వుంది. భూమిమీద కాలూని నిలవాలని జానకమ్మ ప్రతిక్షణం ప్రయత్నం చేస్తూనేవుంది.

పది సంవత్సరాలు జరిగాయి. అవే అదృష్టవంతులకు వేగంగా గడిచిపోయినై. జానకమ్మ ఆ పది సంవత్సరాలూ బరువు నెత్తుకున్న చీమనడక సాగించింది.

జానకమ్మ కూతురు పార్వతి కన్నెం డెళ్లదయింది. కాంతమ్మ కాలగర్భంలో కలసిపోయింది. మాధవయ్య సరిగా నెలనాడే కూతురి కష్టాల్ని చూసే బాధనుండి విముక్తుడయాడు.

తలమునక నీళ్లలో యీతరాని బతుకయింది జానకమ్మది. తండ్రి ఎంత నికృష్ట పరిస్థితిలో చనిపోయాడో వూహించే ధైర్యం కూడా ఆమెకు లేదు.

వదెన కాంతమ్మ సూటిపోటి మాటలకు జానకమ్మ హృదయం తూట్లు పడిపోయింది. పొట్ట గడవటానికి చేసే పనికి కాళ్ళూ చేతులూ కాయలు కాచినయి.

సావిట్లో ఒక గదివార తడికలు కట్టుకొని కూతురితో కాలక్షేపం చేస్తూంది జానకమ్మ. సావిట్లో వుంటూ తన జీవితాన్ని తల్చుకొని అనుకొనేది - తనే యిలా అనుకుంటే ఆ చిన్నమ్మ ఎలా కష్టపడిందో!

పిండి విసురుతూ సక్కుబాయి కష్టం ముందు తనెంత? లక్ష్మమ్మకంటే తనెక్కువ కష్టపడుతోందా? ఏవేవో పిచ్చిపిచ్చి వూహలు జానకమ్మ మెదడులో కదిలేవి.

కూతురు పార్వతి చదువు థర్డ్ ఫారంతో అంతమయింది. అంతవరకూ కూతురు చదువుకు డబ్బు పంపిస్తోన్న సత్యం అన్నయ్య జైల్లో పడ్డాడు. వాడి ఆస్తినంతా ముందే అమ్ముకొన్నాడు.

పెదన్నయ్య, సుబ్బారాయుడిదగ్గరకు పోయి అడిగింది జానకమ్మ "అన్నయ్యా యీసంవత్సరం పెళ్లవగుపు?"

మధ్యలో అందుకుంది కాంతమ్మ. "ఆఁ యింకేం చదువుల్లే! నెత్తిమీదకు పన్నెండేళ్లు వస్తేను."

"అది కాదు వదినా, స్కూలు ఫైనల్ దాకా అన్నా చెప్పిస్తే, దానికాళ్ళమీద అది నిలబడి దాని బతుకు అది బతకగలిగితే చాలు."

"యింకా నయం! వూళ్లు ఏలిస్తానన్నావు కాదు? అన్నట్టు మీ ఆయన బతికుండగా డాక్టరు చదివిస్తాననేవాడటగా?"

జానకమ్మ హృదయం బల్లెంతో గుచ్చి ఎత్తినట్లయింది. కాంతమ్మ యిలా హేళన చేయటం ఇది మొదటిసారి గాదు.

"అన్నయ్యా!" అన్నది జానకమ్మ.

అన్నయ్య పలకడు వులకడు! సుబ్బారాయుడిలోని 'అన్నయ్య' చచ్చిపోయి చాలా రోజులయిందన్న సంగతి జానకమ్మకు తెలియదు. ఆ సుబ్బారాయుడిలోని వ్యక్తిత్వం పెళ్ళాం ధాటికి తాళలేక ఏనాడో అంతరించిపోయింది.

"ఇంకేం చదువమ్మా పెళ్ళీడుకొస్తేను? ఎవరన్నా చూసి ముడేస్తే విరగడైపోతుంది! మీరయినా చెప్పకూడదండీ? మీ అమ్మాయికి తెలియకపోతే!" భర్తమీద వోక విసురు విసిరింది కాంతమ్మ.

సుబ్బారాయుడు పైపంచ దులుపుకుని భుజాన వేసుకొని బయటకెళ్ళాడు.

'అప్పుడే పార్వతికి పెళ్లా?' మథన పడింది జానకమ్మ.

"అవును! పెళ్లీడుకొచ్చింది గా?" అంది లోకం. జానకమ్మ యిలా మథనపడుతూండగానే మూడు సంవత్సరాలు గడచిపోయినై.

ఇప్పుడు పార్వతికి పది హేనో సంత్సరం వచ్చింది. పెద్దమనిషయి ఇంట్లో కూర్చుంది. పిల్లకూడ ఏపుగా పెరిగింది.

కూతుర్ని పెద్ద చదువులు చదివించి డాక్టర్ని చేయాలనుకున్న వెంకట్రావూ జానకమ్మల కోర్కెలు మట్టిగలిసిపోయాయి. చదువు థర్డ్ ఫారంతో అంతమయింది. జానకి కలలు కళ్ళయిందే కరిగిపోయినయ్. ఒక్క జానకమ్మ రెక్కల కష్టంమీద రెండు పొట్టలు గడవటమే సమస్య అయిపోయింది. దానికి తోడు పార్వతి పెళ్లి సమస్య జానకి గొంతుకు గాలంలా తగులుకుంది.

ఒకరోజు సాయంకాలం సుబ్బారాయుడుతో "అన్నయ్యా! పార్వతికి ఏదైనా మంచి సంబంధం వుంటే చూడు" అన్నది జానకమ్మ.

"సరే! చూద్దాం" అన్నాడు సుబ్బారాయుడు.

"ఇంకేం. అయితే! ఆ భద్రయ్యకిచ్చి చేయరాదూ?" అంది సుబ్బారాయుడు పెళ్లాం నాలుగోపిల్లడ్ని చంక నేసుకొని వచ్చి

"అగేమిటివదినా! అట్లాఅంటావు? ఆ ముసలాడికి ఎలా యివ్వనుంటావు? చూస్తూ చూస్తూ నా బిడ్డగొంతు కోయమంటావా?" అన్నది జానకమ్మ వణికిపోతున్న కంఠంతో.

"నీదంతా వట్టి విడ్డూరమమ్మా! ముసలాడంటావేం? యింకా కలకాలం నిండినవాళ్ళ లేదో? అంత ఆస్తిపరుడు నీ పిల్లనడిగాడంటే అంతా నీ అదృష్టమనుకో! కూటికీ గుడ్డకీ దిగుల్లేకుండా జరిగిపోతుంది. నీకూ పదికాలాలపాటు నీడ దొరుకుతుంది"

ఆఖరిమాటలు జానకమ్మ ఆత్మాభిమానం మీద దెబ్బతీసినయ్, కోపంగా అన్నది — "వదినా! నీ కెందుకమ్మా అంత చులకన?"

"మాశారా? మాశారా? అంగుకే మంచికి పోతే చెడు ఎదురవుతుందట. నీ మంచికి చెబితే అంత కోప మెందుకమ్మా? అవునులే! నీకు గడపగడపా ఎక్కి పూడిగం చేసే రాతుంటే నా మాట లెందుకు చెవికెక్కుతాయి"

"ఇక చాల్లే వదినా!" అంటూ జానకమ్మ గుడ్లనీరు గుడ్ల నింపుకొని తిరిగొచ్చింది.

అన్నయ్య ఉలకడు, పలకడు. బెల్లం కొట్టిన రాయిలా గోడ కానుకొని అలాగే కూర్చున్నాడు.

ఇంకో సంవత్సరం గడిచిపోయింది.

పార్వతికి పదహారు ఏళ్లు వచ్చినై. జానకమ్మ హృదయంలో అశాంతి, దిగులు గూడు కట్టుకుంటున్నాయి

"కూతురు పెళ్లి ఎప్పుడు చేస్తావు?"

"ఇంకా ఎంతకాల ముంచుతావమ్మా?"

"దమ్మిడీ యివ్వటం చేతగానివాళ్లకు ఇంద్రుడూ, చంద్రుడూ ఎక్కడ్నుంచి వస్తాడమ్మా?" "బుద్ధులు భూము లేలుతుంటే గాతలు గాడిదలు కాస్తున్నాయట!" "లక్షణంగా భద్రయ్య కిచ్చి సుఖపడకా!" ఇలా వొక టే కాకిగోల.

లోకం చేసే ఈ కాకిగోల అహర్నిశలు జానకమ్మ చెవుల్లో గింగురుమంటూనే వుంది.

"ఏం అన్నయ్యా! పార్వతి పెళ్ళి మాటే?" అన్నయ్య నడిగింది జానకమ్మ

"ఎక్కడో స్తారమ్మా! ఆ భద్రయ్యకిస్తేనే బాగుంటుం దనుకుంటాను"

"అన్నయ్యా —"

ఎవరిమీదనో ఏదో తెలియని కసి జానకమ్మ అంతరాళంలో పెరుగుతూ వచ్చింది దానికి కటలు తెగిపోయినయ్ తను యిక అంత పని చేస్తుంది!

జానకమ్మకు చిన్నన్నయ్య తలపుకు రాగానే దుఃఖం పొర్లుకు వచ్చింది

"ఎవర్ని వుద్ధరించటానికని యీ దేశసేవ? నీ మేనకోడలూ చెల్లెలూ యింత అన్యాయం అయిపోతుంటేను!" అనుకుంది జానకమ్మ.

జానకమ్మ పైట చెంగుతో కళ్లు తుడుచుకొని భద్రయ్య గారింటికి కబురుచేసింది

## 6

భద్రయ్య తరలివచ్చి పార్వతిని పెళ్లి చేసుకున్నాడు.

పెళ్లి జరుగుతున్నంతసేపూ జానకమ్మ వో కంట నీరు కారుస్తూనే వుంది, కూతురుకు పట్టిన దుర్దశనూ, భర్తనూ, తల్చుకొని. తనూ, ఆయనా కలసి పార్వతినిగురించి ఎన్ని కలలు కన్నారు? ఎన్ని ఊహాసౌధాలు నిర్మించుకున్నారు? గుళ్ళి గుళ్ళి ఏడ్చింది జానకమ్మ.

"వూరుకో జానకమ్మా యిష్టమయి ఇచ్చుకున్నాక, అంతా అయినాక ఏడవటం దేనికి? అల్లుడు కూతురు పదికాలాలపాటు బాగుండాలనుకోక!" జానకమ్మను ఓదార్చింది యిద్దరు ఆడపిల్లల తల్లి వో కావిడ.

ఆరు నెలలు గడిచిపోయినై. చీకటినీ వెలుతుర్నీ మేస్తూ కాలం సాగిపోతోంది.

పార్వతి కాపరానికి వెళ్లింది కూతుర్ని కనిపెట్టుకొని జానకమ్మ అల్లుడింట్లోనే వుంది.

అల్లుడింట్లో జానికమ్మకు అనుకున్న దానికంటే హాయిగా కాలం గడిచిపోతోంది

మళ్ళీ ఇన్నాళ్ళకు కాళ్లకు భూమిమీద పట్టు చిక్కినట్లయింది. చేతి కింత ఆసరా దొరికినట్లుంది.

వేళ కింత తిండీ, కట్టుకోవటానికి రెండు జతలు పంచెలూ దొరుకుతున్నయ్ అంతకంటే తనకేం కావాలి? భద్రయ్యా పాతిక ఎకరాలదాకా వున్న ఆసామి పెద్ద లోగిలీ వుంది. సొంత వ్యవసాయం చేయించుకుంటూ వుంటాడు ఆ వుపాటి పొట్టా అదీ మనిషి వికారంగా వుంటాడని చెప్పాలి. మొదటిభార్య కొడుకు సూర్యనారాయణకు ఇరవయి సంవత్సరాలుంటాయి పట్నంలో బి. ఏ చదువుతున్నాడు

వేసవికాలం సెలవలకు వచ్చి రెండు నెల్లు వుండి వెళ్ళాడు. పార్వతంటే ఆదరం, కలుపుగోలుతనం చూపేవాడు.

వంటింట్లో పెత్తనమంతా జానకమ్మదే. ఇప్పుడు జానకమ్మ చేసేపని వంట మినహా యింకేమీ లేదు.

ఇప్పుడెప్పుడు అల్లుడికి అన్నం తనే వడ్డిస్తుంది. అలుడూ కలుపుగోలుతనంగానే మాట్లాడుతున్నాడు తను బిడియం లేకుండానే భద్రయ్యతో మాట్లాడుతోంది.

అత్తగారిదగ్గర భద్రయ్య బాగా చనువు తీసుకున్నాడు

అప్పుడప్పుడూ భద్రయ్య ప్రవర్తనకు జానకమ్మ మనస్సు చివుక్కుమ నేది. అయినా అల్లుడేగా, ఒకమాట అనటంగా అనుకొనేది. తను ఎలా అయితే ఏం? కూతుర్ని సరిగా చూస్తే చాలు తనకు అంతకంటే యింకేం కావాలి?

రాత్రిపూట అన్నంవడ్డిస్తుంటే భద్రయ్య ఆమెకళ్లలోకి అదోరకంగా చూసేవాడు తిన్న అన్నమంతా ఏమయేదో తనవైపు ఆకలిగా చూశేవాడు. ఆ అసహ్యమైన చూపులకు ఆమెకు వంటిమీద తేళ్లు పాకినట్లుండేవి.

మనిషితరహా యింతేనేమోనని సర్ది చెప్పుకొనేది. ఏమైనా అల్లుడు. తన కూతురు సౌఖ్యంకంటే తనకు కావాల్సిం దేముంది?

ఒకరోజు రాత్రి . వంటింట్లో అల్లుడు తిన్న అన్నం పళ్లెం జానకమ్మ వంగితీస్తోంది పైట చెంగు ఎవరో గట్టిగా గుంజారు జానకమ్మ త త్తరపోయి వెనక్కు తిరిగిచూసింది. భద్రయ్య!

జానకమ్మవళ్లుజలదరించింది! 'ఛీ' అంటూ తోకతొక్కినతాచులా లేచింది గోపంతో రక్తం కుతకుతలాడింది భద్రయ్యనుచూసి గోడకానించివున్న పీటనుతీసి రెండుచేతుల్తోనూ పట్టుకుంది ఒక్క క్షణం తటపటాయించి ఎత్తి కిందవున్న పళ్లెంమీదకువిసరింది.

'ఖంగ్'మని పళ్లెం మోగింది.

ఖంగారుగా భద్రయ్య బైటకిపరుగెత్తాడు. భద్రయ్య పార్వతి మొగుడు కాకపోతే ఆపీట ముఖానికే విసిరికొట్టి ఉండేది.

తెల్లారి జానకమ్మ గుడ్డలు సర్దుకుని ప్రయాణమైంది "ఇప్పు డెక్కడికమ్మా నీ ప్రయాణం? అసలు ఎందుకే వెళ్ళటం?" అన్నది పార్వతి.

"కాగు లేమ్మా! వెళతాను!" కళ్లి వెంట నీరు తిరిగినయ్ జానకిక్కి.

"అసలుసంగ తేమి టే అమ్మా?" అన్నది పార్వతి ఆదుర్దాగా.

జానకమ్మకొచ్చినకష్టం ఒకరికి చెప్పేదా? అందులోనూ కూతురికి ఏమని చెబుతుంది?

"అమ్మా నీవెళితే నేనూ వస్తాను. నువ్వు లేకపోతే ఒక్క క్షణం ఇక్కడుండను" వెంకగా జాలిగా అన్నది పార్వతి.

గుడ్డల మూట లోపల పెట్టింది జానకమ్మ. తన కూతురు సంసారం బాగుంటే చాలు. తను ఎన్ని బాధలైనా సహిస్తుంది.

జానకమ్మకు అల్లుడింట్లో యమలోకపు తెరలు తెచినయు!

"నా సొమ్ము తి నేసరికి నీకూడా వళ్లు బలిసిందే" అన్నాడు భద్రయ్య కుక్కను కాలితో తన్నుతూ, జానకమ్మను వోరగా చూసి

కుక్క మీద పిల్లిమీదపెట్టి ఎత్తిపొడుపు మాటలు జానకమ్మను ఏరోజూ అంటూనే వున్నాడు. ఆమె అన్నీ భరించి తలవంచుకొని తిరుగుతూనే వుంది

ఒకరోజు వట్టి పుణ్యానికి పార్వతిని కొట్టాడు భద్రయ్య. ఆ కోపం అంతా తన మీదనే అని జానకమ్మకూ తెలుసు. అయినా ఏం చేయగలదు?

జానకమ్మ పని అడ కత్తెరలోని పోక చెక్కలా అయింది. ఒకవైపు కూతురి సంసారం, మరోవైపు తన శీలం

#  ఆమె - లోకం 

పార్వతికి మొగుడంటే ఇష్టమో అయిష్టమో ఏదీవున్నట్లు తోచదు డబ్బు దొరికినంతవరకూ చీరలుకొనడం, చిత్రరకం పుస్తకాలన్నీ కొని చదవటం మినహా యితర ప్రపంచంతో సంబంధంవున్నట్లే కన్పించదు.

సెప్టెంబరు సెలవలకు సూర్యనారాయణ ఇంటికివచ్చాడు అతడొచ్చాక జానకమ్మకు కొంత మనశ్శాంతి కలిగినట్లయింది భద్రయ్య పోరు తగ్గింది కొడుకు వచ్చిన దగ్గర్నుంచీ యిన్ని మెతుకులు నోట్లోవేసుకొని పొలంపోయి రాత్రికిగాని యింటికి వచ్చేవాడుకాడు. సూర్యనారాయణతనంటే ఎంతో గౌరవం చూపుతాడు.

కాని ఒకరోజున—

ఓరవాకిలిగా వేసివున్న తలుపు తోసుకొని జానకమ్మ కూతురు గదిలోకి చూసింది

జానకమ్మ తన కళ్లను తానే నమ్మలేకపోయింది! కాళ్లకింద భూమి కదలిపోయింది!! తనేం చూస్తోంది?

సూర్యనారాయణ—

గిర్రున వెనక్కు తిరిగింది కాళ్లు తేలిపోతున్నాయి. తనకు మతి చలించిపోతోంది పార్వతి తన కూతురు, యింత పాపానికి వొడికడుతుందా? ఛండాలుడు? సూర్యనారాయణ! ఛీ వాళ్ళవంశమేయింతా? అయితే తన కన్నకూతురు పార్వతి—

జానకమ్మ శరీరం దహించుకపోతోంది

"పార్వతీ!" ఆడపులిలా గాండ్రించింది జానకమ్మ

"అమ్మా వస్తున్నా!" పార్వతి పరుగెత్తుకుంటూ వచ్చింది

"ఛి పాపిష్టిదానా! నా కడుపున చెడపుట్టావు?" పార్వతి చంపమీద ఛెళ్లున కొట్టింది తల్లి.

"యీ నీచపుబ్రతుకు బ్రతక్కపోతేనేం? పార్వతి నిశ్చేష్టురాలై నిల్చుంది

"ఛీ, నీముఖం చూపించకు! నీవు నా కూతురివి కావు నీకు నేను తల్లినికాను!" జానకమ్మ రయిన వెళ్లిపోయింది.

సావిట్లో మంచంవాల్చుకునికూర్చునిముఖానికి చేతులడ్డం పెట్టుకొనికుమిలికుమిలిఏడ్చింది

పార్వతికి కళ్లు మసకలు కమ్మిపోయినయ్. ఆమెశరీరం ఆమెకే బరువుగా తోచింది గది తలుపులు బిగించుకొని మంచంమీద పడుకొని వెక్కి వెక్కి ఏడ్చింది శరీరం కంపించిపోతోంది. తనమీద తనకే అసహ్యం కలిగింది

"ఛీ! ఆపాడుబ్రతుకు బ్రతక్కపోతేనేం?" తనతల్లేనా ఆమాటలన్నది? అష్టకష్టాలూపడి తనను పెంచి పెద్దదాన్నిచేసిన అమ్మేనా అలా అనటం? తనకోసం తన జీవితమంతా యీయింట్లో వూడిగం చేయటానికి సిద్ధపడిన తల్లేనా? పార్వతికి అభిమానం రోషం పెనవేసుకొచ్చాయి. గుండె రాయి చేసుకుంది

"ఛి యీనీచపుబ్రతుకు బ్రతక్కపోతేనేం!" ఎవరో చెవులో అరుస్తున్నట్టుగావుంది!

ఆరాత్రి జానకమ్మకు నిద్రపట్టలేదు. బుర్ర పగిలిపోయే ఆలోచనలు.

పార్వతిని ఎందుకు కొట్టింది? తను ఎందుకింత తొందరపడింది? చిన్నతనం, ఏదో తెలియక చేసింది ముసలాడికిచ్చి పార్వతిని చేయటం తన తప్పు కాదా? కోపంతో ఏమేమో అన్నది తన చిట్టితల్లి ఎంత బాధపడిందో? తను బుజ్జగించి చెబితే పార్వతి వినేదికాదా? తన చేతుల్తో పార్వతిని ముసలాడికిచ్చి గొంతుకోసింది. తను యింత తిండి దొరుకుతుందని పార్వతిని అన్యాయం చేసిందా? తన భర్త పార్వతిని గురించి ఎన్ని కలలు కన్నాడు? కుళ్లికుళ్లి ఏడ్చింది జానకి

పార్వతినిగురించిన బాధతో జానకమ్మ నిద్రలోకి జారిపోయింది రాత్రంతా పీడకలలు!

తెల్లవారుతోంది. పని మనిషి ఏడుపూ, జనం అరుపులూ గోలగా వినపడుతున్నాయి! జానకమ్మ త్రుళ్లిపడి లేచింది.

పార్వతి శవాన్ని అప్పుడే భావిలోనుంచి తీస్తున్నారు! జానకమ్మ గుండె బాదుకుంటూ పోయి బావిఒడ్డున పడుకోబెట్టిన పార్వతి శవంమీద వాలిపోయింది

సూర్యుడస్తమించబోతున్నాడు. కబురు విని సుబ్బారాయుడు, కాంతమ్మ, రామదాసూ వచ్చారు భద్రయ్య తరఫు బంధువులుకూడ వచ్చారు

పార్వతి పాడెపై ముత్తైదువులు పసుపు కుంకం చల్లారు కూతురి శవంమీదపడి జానకమ్మ గోడుగోడున ఏడ్చింది ఆమె ముఖానికి శరీరానికి పార్వతిపైన చల్లిన పసుపూ కుంకుమా అలుముకున్నాయి

చీకటపడింది

భద్రయ్య యింట్లో యిప్పుడు పార్వతి కూడ లేదు రాత్రి పన్నెండు గంటలవుతోంది. కారుమబ్బులు కమ్ముకున్నాయి. జల్లుగా చినుకులు పడుతున్నాయి జానకమ్మను వోదార్చటానికి కూర్చున్నవాళ్లంతా నిద్రపోతున్నారు

జానకమ్మ మెల్లగా లేచి నిల్చుంది. వూరికివుత్తరాన శ్మశానందగ్గరకు వెళ్ళింది. పార్వతి చితి గనగన మండుతోంది! మంటలు మెల్లగా ఆరి మసిఅవుతోంది

దూరంగా మంచాని కళ్లార్పకుండా చూసింది జానకమ్మ

తన ఆశాజ్యోతి పార్వతి కాలి మసి అయిపోతున్నది ఇంక యీ లోకంలో తనకు పనేమిటి? ఎక్కడికి పోతోంది? అల్లుడింటికా? అన్నయ్య యింటికా?

ఇక తన బ్రతుక్కు అర్థం ఏమిటి? ఇంకా జానకికి ముప్ఫయి మూడేళ్లు నిండలేదు జీవితంలో మూడో వంతు జరగలేదు. కాని మూడు జన్మల బాధ లనుభవించింది. మూడు తరాల కష్టాలు పంచుకొంది.

ఆ చీకట్లో ఆరిపోతున్న పార్వతి చితిని చూస్తూ జానకి అలా ఎంతసేపు ఆ స్మశాన వాటికలో నుంచుందో? 

# బొమ్మరిల్లు

## ★ శ్రీరామచంద్రుడు ★

రచన:
నందూరి రామమోహనరావు

ఆకాశములో
రాకాచంద్రుడు
వన్నెల చిన్నెల
వెన్నెలకురిసెను.

భూలోకములో
బాలకుడొక్కడు
కన్నులవిందుగ
గాంచెను చంద్రుని

కాంచినతోడనె
కరములు చాచెను.
కాని అందునా
గగనబింబములు
కరముల కందని
గగనబింబమును
కోరి బాలకుడు
మారాం చేసెను.

అందమైనదా
చందురుడే తన
కిమ్మని బాలుడు
ఏడుపసాగెను.

ఎన్నో బొమ్మలు
ఎన్నో సొమ్ములు
ఎన్ని తెచ్చినా
అన్నీ వద్దనె

తల్లి చెప్పినా
తండ్రి చెప్పినా
ఎందరు చెప్పిన
ఏడుపు మానడు.

అపుడా బాలుని
అల్లరి మాన్పగ
మంచియుపాయము
కాంచిరిఅందరు.

అతని చేతికి
అద్దమునిచ్చిరి.
అద్దము లోపల
నగపడె చంద్రుడు.

ఆకాశములో
అది శశిబింబము.
శిశువు చేతిలో
శశిప్రతిబింబము!

అదిగని నవ్వెను
ముదమున బాలుడు.

అదిగని నవ్విరి
అమ్మానాన్నా.
అదిగని జాబిలి
ఆనందించెను.
ఆనందించెను
అఖిలజగమ్ములు!

మీ రెరుగుదురా
మారాం చేసిన
గారపు బాలుడు
శ్రీరాముడనీ?

చంద్రునికై చే
జాచెను కనుకనె
రామచంద్రుడను
నామము కలిగెను.

నవమినాడు అత
డవతరించి తన
యశశ్చంద్రికలు
దిశలను కురిసెను.

అవునవు నతడే
అతడే రాముడు
జాబిలి వలెనే
జగదభిరాముడు!

# తెలివైన కుక్క

మద్దులవారి రామకృష్ణ

సత్యం మాయింటి ప్రక్క అబ్బాయి. వారికి ఒక పెద్దమేడ ఉంది. ఆమేడముందు మంచి పూల తోట. ఆతోటలో బలేరకరకాల గులాబీలు, మందారాలు, చామంతులు, ఇంకాఎన్నో పూలచెట్లు రంగు రంగు పూలతో కన్నుల పండుగ చేస్తున్నవి. గుమ్మని కమ్మని వాసనలను ఆపూలు విరజిమ్ముతున్నవి. చూస్తే ఆపూల తోటే చూడాలి. లోనికి పోదామంటే గేట్ లో ఒక కావలికుక్క. ఎవరినైనా కను మూయవచ్చును గాని దానిని మరపించటం మన వశముగాదు. ఇజ్జా, ఇజ్జా, యని మాలిమి చేసుకుంటే తప్ప లేకుంటే పైబడిపీకి పాకాన పెడుతుంది. అక్కడికీసత్యం ఆడుకోను రమ్మని నన్ను పిలుచుక పోతూ ఉండేవాడు. ఎల్లప్పుడు అక్కడేవుండి ఆపూలతోట చూస్తూ మంచి వాసనను హాయిగా పీలుస్తూ వుండాలనిపించేది.

వేసవి శెలవులుయిచ్చారు. చిల్లో, బొల్లో మంటూ ఆడుతూ, పాడుతూ, దినమొక నిముషముగా గడుపుతున్నారు పిల్లలు. ఎందుకో యేమో ఆయేడు దొంగల హడావుడి జాస్తిగావుంది. అందరు రాత్రిళ్లు నిద్రపోక ఊరు కావలి కాస్తున్నారు. సత్యం నాన్న దొంగల కావలికి ఒక చురుకైన కుక్కను పెంచుతూ వున్నారు. దాని రంగు నిగనిగలాడే నలుపు. ప్రొద్దు కూకిందంటేసరి, చిను చిటుక్కుమన్నా బౌంబౌం అని కుక్క మొరుగుతుంది. దానికి మాంసము, పాలు, మంచితిండి పెట్టేవారు. అది తిని బలేబాగా బలిసింది కుక్క. ఆసరదాలోపడి సత్యము చదువు మాని వేసి, పొద్దస్తమానము దానితో ఆడుతూ కూర్చొనేవాడు. దానికి



తీవ్రాలోచన

ఫోటో: కె. ఎస్. ఆర్. ఆంజనేయులు, గుంటూరు.

సర్కస్‌ఫీట్లు నేర్పేవాడు. తళ తళ లాడే పటకా గొలుసు కొన్నాడు. మెడలో గొలుసుకట్టి నంబరాలు పడుతూ షికారుకు తీసుకపోయే వాడు. స్నేహితులకు, కుక్కను చూపి, హుషారుగా చంకలు కొడుతూ వుండేవాడు. ఎఱ్ఱసబ్బు వేసి రుద్ది చలిపుడుతుందని గోరు వెచ్చని వేడినీళ్లు పోసేవాడు కుక్క వళ్లు ఎక్కడ వత్తుకపోతుందోనని పడుకోను మంచి ముఘమల్ బూరుగుదూది పరుపుకుట్టించాడు. కుక్కతోటే వాడికి కైలాసము. అదుంటే వాడికి యింకేమి పట్టదు.

సత్యము ఒకనాడు నీలి బుష్ కోటు, పంజాబీ పైజామా, కాన్పూరుచెప్పులు వేసుకొని ముస్తాబై పక్కపేటలో నున్న సీత అక్కగారింటికి చూడ వెళ్ళాడు. కుక్క విశ్వాసముతో, తోకఆడిస్తూ వెంటవెళ్ళింది. తమ్ముడు సత్యాం రాగానే ఎంతో గారాబంతో, తినమని ఒకబూరె సీత యిచ్చింది. "పంచవన్నెల గులాబి పువ్వులు పూసిందా"? కఱ్ఱఆవు యీనిందా? జున్నుపాలు తెచ్చావా? అమ్మ జిగినిగొలుసు వీరాచారి చేసి యిచ్చాడా?" అని ఇంటిసంగతు లన్నీ అడిగింది. వెంట వచ్చిన కుక్కను వసారాలో పెద్ద బల్ల క్రింద పడుకొని దిగులూ, విచారము లేకుండా నిద్రపోయింది. సందెవేళ కావస్తున్నది. నల్లమబ్బులుముసురు కొస్తున్నవి. వానవస్తుందని గబగబా బయలుదేరి యింటికి తిరిగివచ్చాడు సత్యము. ఆ హడావుడిలో కుక్క సంగతే మరచిపోయాడు.

ఇంటికివచ్చి అన్నము తిన బోయేముందు కుక్కసంగతి గుర్తు



బొమ్మకు ముద్దు

ఫోటో: ఎస్. కామేశ్వరరావు.

వచ్చింది సత్యానికి. పేటలో అక్కగారింటివద్దనే కుక్క వుండిపోయిందని ఎంతో అనుకొన్నాడు. అయినా పరవాలేదులే చీకటిలో దానికోసమై పోకపోతే మానితే అని బద్ధకించినాడు.

ఇంతలో గాలిజోరుగా వీచింది. దుమ్ము ఆకాశమంతా అలుముకొంది. చిటపట చినుకులు టపటప రాలినయి. ఆ తరువాత వానజోరు అయింది. కుండపోతగా వానకురిసి వెలసింది. ప్రొద్దు పోతుందని సీత తలుపు వేయబోయింది. కుక్క చెవులు టపటప కొట్టుకొంటూబయటకు పరుగెత్తింది. చీకటిలో తడుముకుంటూ కుక్క ఆ యిల్లు చేరింది. కాని ఎప్పటిలాగా హుషారుగా లేదు. సత్యం పిలచినా గబగబా తోకఆడిస్తూ దగ్గరకు పోలేదు.

దసరా పండుగ దగ్గరకు వస్తున్నది. పండుగకు అక్కను తీసుకరావాలని బులబాటంతో సత్యం పేటకు వెళ్ళాడు. కుక్క అతనివెంట మామూలుగా తోక ఆడిస్తూ వెళ్ళింది. ఎప్పటిలాగా కాక

(బొమ్మరిల్లు సీరియల్)

# జూదరి

మూలం: చార్లెస్ డికెన్స్ అనువాదం: కె. రామచంద్రరావు

నెల్, ఆమె తాత ఎంతో హాయిగా జీవిస్తూఉంటారు. తాతకి ఎక్కువ ధనం సంపాదించాలని బుద్ధి పుట్టి, చీట్లాటకి దిగుతాడు. అప్పుల పాలవుతాడు. బాకీ పెట్టిన క్విల్ప్ అనేవాడు వాళ్ళ ఇల్లు, దుకాణం స్వాధీనం చేసుకుంటాడు. తను చీట్లాడుతున్న రహస్యం బయట పెట్టిఉంటాడని తాత తనదగ్గిర పనిచేసే కిట్ పై ఆగ్రహపడతాడు. తాతను అక్కడనుంచి దూరంగా తీసుకుపోతే కాని సుఖం, శాంతి ఉండవని, నెల్ అనుకుంటుంది. నెల్, తాత ఎవరితో చెప్పకుండా లండన్ విడిచి పెడతారు. వారు అలా పోతూండగా ఒక తోట తోలుబొమ్మలాట వాళ్ళుఇద్దరు తారసిల్లుతారు. వాళ్లు వీరిని చూచి అనుమానపడి పట్టిఇస్తే బహుమతి దొరుకుతుందని అనుకుంటారు. వారి మాటలు రహస్యంగా విన్న నెల్ తాతని తీసుకొని పారిపోతుంది. ఒక ఉపాధ్యాయుడు వారికి అతిథ్యమిస్తాడు. అతడెంతో మంచివాడు. అక్కడ ఒక రోజు ఉండి నెల్, తాత మళ్ళీ బయలుదేరుతారు. త్రోవలో వారికి ఒక మైనపుబొమ్మల ప్రదర్శనం యజమానురాలు, జార్లీ, కలుస్తుంది. ఆమెకు నెల్ పైన ఎంతో ప్రేమ కలుగుతుంది. ఇద్దరికీ తనదగ్గిరఉద్యోగంఇస్తుంది. నెల్ మంచిపేరు సంపాదిస్తుంది. డబ్బుసంపాదిస్తుంది. ఇలాసుఖంగా ఉంటూఉండగా, తాతకిమళ్ళీ చీట్లాటఅలవాటు పట్టుకుంటుంది నెల్ సంపాదించినడబ్బంతా తగలేస్తాడు. నెల్ ఆడవద్దని ప్రతిమాలి చెప్తుంది.

## 4

తాత పగలంతా అలా చింతాక్రాంతుడైఉన్నాడు. ప్రొద్దు కుంకింది. చీకటిపడుతున్న కొద్దీ అతనికి చీట్లాడాలన్న ఉబలాటం ఎక్కువ కాసాగింది. ఒక్కసారిగా నెల్ వద్దకి వెళ్లి, ఆమెపర్సులో ఉన్న డబ్బు బలవంతంగాతీసుకొని సత్రానికిబయలుదేరాడు. నెల్ పాపం! కన్నీళ్లుకార్చింది. పగలంతా అతడు మారుతాడన్నఆశ. రాత్రిళ్లు తాత చేసిపోతున్నాడన్న చింత! ఈ విశాలప్రపంచంలో తనకు కావలసిన వాడు తాతఒక్కడే. ఇక తనబాధ హృదయంవిప్పి ఎవరితో చెప్పుకుంటుంది? మనశ్శాంతికోసం ఆమె ఒక్కతే సాయంత్రంపూట అలా వెళ్లితిరిగివచ్చేది.

ఒకరోజున నెల్ షికారు పోయి తిరిగివస్తూంది. ఒకచోట విశాలమయిన బయలు ప్రదేశంలో ముగ్గురు మనుష్యులు చిన్నమంట చుట్టూ కూర్చునిఉన్నారు. నెల్ వాళ్ళనిచూసింది. అందులో ఒకడు తనతాత! తక్కినఇద్దరూ వర్షం పడిననాడు సత్రంలో తాతతో చీట్లాటఆడినవాళ్లు.

అప్పటికే దిగులు పడుతున్న ఆమె పసిహృదయం ఈజూదగాళ్ళ రహస్య సమావేశంచూసి మరింత క్రుంగిపోయింది. అడుగులోఅడుగు వేసుకుంటూ నిశ్శబ్దంగా వెళ్ళి ఆమెవారిని సమీపించి, రహస్యంగా వారిమాటలు ఆలకించింది: అందులో ఒకడు నెల్ తాతనిఅడుగుతున్నాడు.

"అయితే జార్లీకి చాలాడబ్బు ఉన్నదన్నమాట."

"ఔను ఉన్నది."

"ఆమెకు తెలియకుండా దొంగతనం చెయ్యగలవామరి?"

"ఓ! చెయ్యగలను."

ఈసంభాషణ అంతా వినేసరికి నెల్ రక్తం గడ్డకట్టిపోయింది. శరీరం చల్లబడిపోయింది. తిరిగి సంభాషణ ప్రారంభమైంది.

### తెలివైన కుక్క

యీసారి సత్యం చెప్పులు గట్టిగా నోటకరచుకొని వసారాలో బల్ల క్రింద పడుకొని గుఱ్ఱుపెట్టి, నిద్రపోయింది. ఈమారు సత్యం కుక్క సంగతి మరచిపోలేదు. ఇంటికి పోబోయేముందు కుక్క కోసము యిల్లంతా గాలిస్తున్నాడు. ఇంటిచుట్టూదానికోసము వెతికాడు. అదిఅంతాచూచి సీత పకపకానవ్వింది. తమ్ముణ్ణి తీసుకెళ్లిక్రింద నిద్రపోతున్న కుక్కను చూపి, "చూడరా, సత్యము! నీకుక్క బలేతెలివైనదిరా! తమాషా చేసింది. బల్లక్రిందదాక్కుంది. నీవు దానిని లేపకుండా మరచిపోతావేమోననిముందుగానేజాగ్రత్తపడింది. నీచెప్పులు దొంగలు ఎత్తుకొని పోకుండా భద్రంగా కాపలి కాస్తున్నది. ఇప్పుడు ఆకుక్కను లేపకుండ నీవు చెప్పులు తొడుక్కొనలేవు గదా!" ★

"ఎలా దొంగతనం చేస్తావు?"

"ఆమె నిద్రపోయే గదిలోనే డబ్బు పెట్టేఉంటుంది. ఆ శాలకు నిప్పంటుకుంటుం దేమోననే భయం కొద్దీ ఎప్పుడూ ఆమె తలుపులు తెరచిపెట్టే నిద్రపోతుంది."

"చాలామంది అటూ ఇటూ తిరుగుతూ ఉండరూ?"

"ఉంటారు. వాళ్ళలో కొందరు అనుమానాస్పదులుఉన్నారు."

"అవునులే, డబ్బుపోయినా ఆమె వారిమీదనేఅనుమానపడుతుంది."

---

"తప్పకుండా"

"అయితే ఎప్పుడు చేస్తానంటావు ఆపని?"

"రేపు."

"ఈ రోజే ఎందుకు చెయ్య కూడదు?"

"లాభం లేదు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. మరి దొంగతనం చెయ్యాలంటే కొన్ని ఏర్పాట్లు చేసు కోవాలికదా!"

"పోనీ రేపయినా చేస్తావా?"

"తప్పకుండా చేస్తాను రేపు"

అనంతరం ఒకటి రెండు నిమిషాలకు తాత లేచి నడకసాగించాడు. నెల్ కదలలేకపోయింది. తాత వెళ్లిపోయిన తరవాత వారిలో వారు ఏమనుకుంటారో వినాలని ఆమెకు అనిపించింది. తాత కొంత దూరం పోయినతరువాత వాళ్లుసంభాషణ ఆరంభించారు.

"హు! పిచ్చాడు! ముసలిపిశాచం! డబ్బుతేనీ! ఇద్దరంకలిసి తేలికగా గెలిచేద్దాం. తరువాత మన మిద్దరం పంచుకోవచ్చు.

"అలాగే."

"ఒకవిషయం. డబ్బుమనం గెలిచాక ఒక్కక్షణం ఉండకూడదు. వీడి భ్రమకాని, ఆమె ఎలాగూవాడిపైన అనుమానపడుతుంది. పోలీసులు పట్టుకుంటారు. అనవసరంగా మనమూ చిక్కునపడతాము:

"డబ్బు చేతికివచ్చాక మనకు మాత్రం ఏం పనిఇక్కడ?"

నెల్ వినవలసిన మాటలు విన్నది. నెమ్మదిగా అక్కడనుంచి బయలుదేరి వెళ్లిపోయింది. ఇంటి దారి పట్టింది. నెల్ మనస్సు ఇరుకునపడింది. ఆమెగుండెలు కొట్టుకుంటున్నాయి. కళ్లు తేలిపోతున్నాయి.

తనగది చేరుకొని పక్కమీద వాలింది. అటూఇటూ పొర్లిందికాని మనస్సు ప్రశాంతంగా లేకపోతే నిద్ర ఎలాపడుతుంది.? కళ్లుగట్టిగా మూసుకుంది. మగత నిద్రలో ఆమెకు కలవచ్చింది. తన తాత జార్లీపడుకునే గదిలోకి వెళ్ళినట్లు, డబ్బుదొంగతనం చేస్తున్నట్లు కల గన్నది. ఉలికిపడిలేచి, జార్లీగది వైపు వెళ్లి తొంగిచూచింది. ఆమె సుఖంగా నిద్రపోతున్నది. తరువాత తాతగదిలోకి వెళ్లింది. ఆ నిర్భాగ్యుడు వళ్లు తెలియకుండా నిద్ర పోతున్నాడు. నెల్ మళ్లీ తనగది చేరింది. కాని మనస్సు కుదుటపడలేదు. ఈసారి పక్కమీదికి చేర బుద్ధికాలేదు. వెంటనేలేచి తన చిన్నసజ్జలో సామాను సర్దుకొని, తాతవద్దకు వెళ్లి నిద్రలేపింది.

"తాతా! మనంవెంటనే ఇక్కడనుంచి బయలుదేరిపోవాలి. నాకు పీడకలవచ్చింది. అదేకల కొద్దిక్షణాలలో మూడుసార్లువచ్చింది. నువ్వు మన యజమానురాలయిన జార్లీ డబ్బు దొంగిలిస్తున్నట్లు, ఆనాడు సత్రంలోని తోచీట్లాడారే నీ మిత్రులు! వారు నిన్ను ప్రోత్సహిస్తున్నట్లు కలవచ్చింది. ఇక్కడ మనం ఒక్కక్షణం ఉండటానికి వీలు లేదు. పోదాంపద!"

తాత ఏమీబదులు చెప్పలేదు. నెల్ మాటాడినతీరూ,ఆమెమాటలు చూచి అతడు నోరెత్తలేదు. లేచి చేతికర్ర ఊతగాతీసుకొని నెల్ వెనుకనే బయలుదేరాడు.

వెన్నెల విరియకాస్తున్నది. చల్లగా మెల్లిగా గాలి వీస్తున్నది. నెల్ హృదయం తేలికైంది. ఒక మహాపాపంనుండి, ఒకపెద్దవిపత్తు నుండి తాతను తప్పించినందుకు నెల్ సంతోషంతో ఉన్నది. నెల్ ఇప్పుడు నిజంగా తాతకు మార్గ దర్శినిఅయింది. ఇంతవరకు ఆమె రోడ్డుపై తాతనునడిపిస్తూ ఉన్నది. ఇప్పుడు ఒక పాపకార్యంనుంచి అతనిని మరల్చి అతని జీవితాన్నే ఒకదారిని పెట్టింది. తాము ఎక్కడికి పోవాలో, ఇకఏమి చేయాలో నెల్ కి తెలియదు. ఏమయినా ఆస్థలంనుంచి వీలయినంతదూరంగా వెళ్లిపోవటమే.

తెల్లవార వచ్చింది. ఇద్దరూ బాగా అలసిపోయినారు. ఒకఏటి గట్టుమీద చతికిలబడ్డారు. తాతకు నిద్రపట్టింది. నెల్ కునికిపాట్లు పడుతున్నది. కొంతసేపు పోయినతరువాత కొంతమంది పడవవాళ్లు ఆదారినపోతూ ఈ ప్రయాణీకులను హెచ్చరించారు: ఎక్కడికి పోతున్నారని ప్రశ్నించారు. నెల్ ఏమి చెప్పాలో తోచక, పశ్చిమంగా చూపి అటుఅనిచెప్పింది. పడవ వాళ్లు ఆ ప్రక్కనఉన్న పట్టణంపేరు చెప్పి అక్కడికేనా అని అడిగారు. ఎక్కడికిపోయినా తనకు ఒకటే కనుకనెల్ ఔనన్నది.

"మా పడవ అటే పోతున్నది. ఎక్కండి" అని పడవవాళ్లు చెప్పారు. నెల్, తాత పడవ ఎక్కారు. మరునాటి సాయంత్రానికి ఆపడవ ఆపట్టణం చేరింది.

పట్టణంచాలా జనసమ్మర్దంగా ఉన్నది. ప్రజలు గుంపులుగుంపులుగా కల్లోలంగా వీధులవెంట తిరుగుతున్నారు. అక్కడ ప్రకాశవంత

మైనభవనం ఒక్కటీలేదు. గోడలు కలుపులూ, నల్లగా పొగబట్టి ఉన్నాయి. అదిఒక పారిశ్రామిక నగరం. ఫాక్టరీచిమ్నీలనుంచి పొగ నిరంతరాయంగా వస్తున్నది.

నెల్, తాత ఆపట్టణంలో అడుగు పెట్టే వేళకి చీకటిపడింది. కొద్దిగా వర్షంకూడా ఆరంభమైంది. ఇద్దరూ తడిశారు. ఆకలిబాగా వేస్తున్నది. ఆప్రజలు తొందర తొందరగాతిరుగుతున్నారు కాని ఏఒక్కరూ వీరి కష్టగాథవినేటట్లులేరు.

నెల్ తాతనితీసుకొని ఒకఆర్చి క్రిందికివెళ్లింది. అక్కడ అంతా చీకటిగా ఉన్నప్పటికి వర్షంలో తిరగవలసిన పనిలేకుండా స్థిమితం చిక్కినందుకు నెల్ సంతోషించింది.

ఖాళీపర్సుతో, ఆకలి పొట్టలతో అక్కడ వాళ్లు కొంతసేపు నిలబడ్డారు. ఇంతలో మరొకప్రక్కనుంచి ఏదోనల్లనిఆకృతి లోపలికి ప్రవేశించింది. నెల్ అదిచూచి భయంతో అరవబోయింది. ఇంతలో ఆ ఆకృతి దగ్గరికి వచ్చింది. అతడు ఒక మధ్య వయస్కుడు. "ఏం చేస్తున్నారిక్కడ?" అనిప్రశ్నించాడు అతడు. అతడుచాలా జాలిగా ఆప్రశ్న వేశాడు. నెల్ దైన్యంగా తనచరిత్రచెప్పి ఏదైన సహాయం చేయమనికోరింది. ఆవ్యక్తి వికటంగానవ్వాడు. మీరుపెనంమీద నించి పొయ్యిలోపడ్డారు. ఇక్కడి వాళ్లకు దానధర్మాలంటే ఏమిటో తెలియవు. వీళ్లుమనుష్యులు కారు మృగాలు. నేను ఇక్కడి కార్మికుణ్ణి. అదిగో, ఆ కొలిమివద్ద పనిచేస్తుంటాను. మీకు అభ్యంతరం లేకపోతే ఆ కొలిమిసమీపంలో ఇటుకలుపేర్చి ఉన్నాయి చూశారా? వాటిమీద పడుకోవచ్చు. చలివెయ్యకుండాఉంటుంది" అన్నాడు.

ఏమీ లేనిదానికంటె ఇది నయమే. నెల్ తక్షణం తన ఆమోదం తెలిపింది. అతడువాళ్ళని కణకణలాడుతున్న కొలిమిదగ్గరికి తీసుకొనివెళ్లాడు. తెల్లవారేవరకువారు అక్కడ పడుకొన్నారు. ఉదయాన ఆ కార్మికుడు వెళ్ళిపోయేముందు వారినిలేపి, వాళ్లువెళ్లవలసిన దారి చూపాడు. ఆరహదారిపై ఎక్కడా మొక్కా, మోడూ లేదు. కంటికి అగపడేదూరంలో ఎక్కడా కనీసం గడ్డికూడా మొలవలేదు. ఎటుచూసినా, రాళ్లతోకట్టిన కర్మాగారాలే! వాటి చిమ్నీలనుంచి గుప్పుగుప్పున పొగవస్తున్నది. ఆమార్గంపై గుంపులు గుంపులుగా మనుష్యాకృతులు నడుస్తున్నాయి. వాళ్లంతా చీలికలూ పేలికలూ ధరించి నిత్యదారిద్ర్యంతో, ఆకటిబాధతో, దీర్ఘరోగాలతో జీవితాలు గడుపుతున్న మనుష్యులు.

"నన్ను ఇక్కడికిఎందుకు తీసుకొనివచ్చినట్లు?" అని కోపంగా తాతఅరిచాడు. నెల్ ఏమి సమాధానంచెప్పుంది? ఆమె బడలికతో తూలిపోతున్నది. గడచిన రాత్రి వర్షంలో తడిపటంచేత కొద్దిగా జ్వరంతగిలింది. చీకటిపడే పర్యంతం వారు తిరుగుతూనే ఉన్నారు. నెల్ పర్సులో ఉన్నచివరి నాణెంతో కొన్న రొట్టెముక్క తాత అమాంతంగా తినేశాడు. నెల్ జ్వరపు నోటికిరొట్టెరుచించలేదు.

మరునాటి మధ్యాహ్నము వారికి అడుగుతీసి అడుగు పెట్టటం దుర్లభమైపోయింది. ఇంతలో నెల్ కి కొద్ది గజాలముందుగా నడుస్తున్న ఒకవ్యక్తి కనిపించాడు. అతని సహాయంకోరుదామనే ఆదుర్దాతో నెల్ ఎలాగో ఓపిక చేసుకొని పరుగెత్తుకొనివెళ్లింది. అతనిముందు నిలి

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## సముద్రుడు - నది

పి. ఎస్. రామజోగారావు

భూమికి నలువైపుల వ్యా
పించియుండు సముద్రుండు,
తనను చేరు నదులనొక్క
తరిని అడిగె నీవిధముగ—

"పలుదేశములందున ప్రవ
హించే వాహినులారా!
సరిగా నాప్రశ్న కిపుడు
సమాధాన మిస్తారా?

వరదలతో పారునపుడు,
చిన్న మొక్కలను విడుతురు,
పెద్ద మొక్కలను మాత్రం
పెల్లగింతు రెందులకో?"

చెంతనున్న నదియొక్కటి,
కొంతవడికి పలికెనిట్లు:
"నింగినంటు వరదలతో
పొంగి పొరలి వచ్చువేళ,

పెక్కుతోడ పెద్దచెట్లు
నిక్కి నిలిచి యుండుటచే
వేళ్లతోడ పెల్లగించి
వెల్లువతో గొనిపోదుము.

చిన్న మొక్క లట్లుగాక,
నమ్రతతో తలలువంచి
యుండుటచే విడిచి, వాటి
పైనుంచే ప్రవహింతుము!"

ఎంతటి బలవంతులైన,
పరిస్థితుల కెదురుతిరిగి
ప్రవర్తించువారు తుదిని,
భంగపాటు నొందుదురు.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

చింది. అతనిముఖం వంకచూచి "ఆఁ! " అంటూపడిపోయింది.

అతను ఎవరోకాదు. సజ్జనుడు, సహృదయుడు అయిన ఉపాధ్యాయుడే. ఆయన ప్రేమతో నెల్‌ని, దగ్గరకు తీసుకున్నాడు. ఇంతలో నెల్ తాతవాళ్లని సమీపించాడు. ఇద్దరూకలిసి నెల్‌నిసమీపంలోని ఒక సత్రంలోకి తీసుకొనివెళ్లారు.

సత్రంయజమానురాలు నెల్ స్థితిచూచి చాలాజాలిపడింది. నెల్‌కి చెయ్యవలసిన సపర్య లన్నిటిని స్వయంగాచేసింది. మరుసటిరోజుకి నెల్‌కు కాస్త నెమ్మదించించింది. సరియైన ఆహారం, విశ్రాంతి లభించటం వలన నెల్ యథాప్రకారం బలం పొందింది. ఉదారుడయిన ఉపాధ్యాయుడు యజమానురాలి కివ్వవలసినపైకం చెల్లించాడు.

నెల్ కోలుకున్న తరువాత కూడా రెండురోజులపాటు వారు అందరూ అక్కడేఉన్నారు. ఈ రెండురోజులు, నెల్, ఉపాధ్యాయుడు సుఖంగా కాలక్షేపం చేశారు. ఉపాధ్యాయుని కోరికపైన నెల్ తమ వృత్తాంతం సవిస్తరంగా చెప్పింది. ఆయన నెల్ పడ్డకష్టాలకు చాలా విచారించాడు. ఆమె తెలివితేటలకి, మంచితనానికి ఎంతో సంతోషించాడు. తమ ఆకస్మిక సమాగమానికి ఆయన ఆనంద బాష్పాలు రాల్చాడు.

తరువాత ఉపాధ్యాయుడు తన చరిత్రనుచెప్పాడు. ఆయనకి పశ్చిమరాష్ట్రంలో ఒక గ్రామంలో ఆయనకి ఉద్యోగందొరికింది. ఉచితంగా వసతిగృహంఇచ్చి సాలుకి ముప్పయిపౌండ్ల జీత మివ్వటానికి ఒప్పుకున్నారు. ఆయన ఆగ్రామానికిపోతూ ఉండగా దారిలో వీరిని కలుసుకున్నారు. రెండు రోజులు గడిచినపిదప ఉపాధ్యాయుడు వెళ్లవలసిన గ్రామంనుండి బండివచ్చింది. వాళ్లఇద్దరినీ తనతో వచ్చి ఉండవలసిందిగా ఆయన కోరాడు. నెల్ అంగీకరించింది.

మూడవరోజు ఉదయానికి వాళ్లు చేరుకోవలసిన గ్రామం చేరారు. చేరిన కొద్దిసేపట్లోనే ఉపాధ్యాయుడు ఒక మంచివార్త తెచ్చాడు. అక్కడే చర్చితాళాల అధికారిగా తాతకు ఉద్యోగందొరికింది. అతనికి ఉచితంగా ఒకఇల్లు, కొద్దిపాటి జీతంఇస్తారు.

జీవితసముద్రంలో అనేకతుపానులపాలయి చివరికి ఈ రేవుకు చేరుకున్నారు. ఇకమీదట విశ్రాంతి లభించవచ్చునని నెల్ అనుకున్నది.

ఆగ్రామంలోని ● బాలగోపాలం నెల్‌ని ఎంతో ప్రేమతో చూసేవారు. ఆమెని అందరూ "అప్సరస" అనేవారు. ఆవిధంగా వారిద్దరూ ఒకప్రశాంత గ్రామంలో స్థిరపడ్డారు.

(ఇంకా వుంది)

పెండ్లి జరుగుతున్నది. ఆ శాస్త్రులు ఎంతచెప్పినా ఆ పెండ్లికుమారునికి పాపం ఎలా ప్రవర్తించాలో తెలియక తికమకలు పడుతున్నాడు. చివరికి ఆ శాస్త్రులుగారికి విసుగెత్తి "నేను చెసినట్లు చెయ్యవయ్యా బాబూ" అని ఒక్కపొడుంపట్టు ఘాటుగాపీల్చాడు.

పెండ్లికొడుకు ఊహూ "అది నాకు అలవాటు లేదండి" అన్నాడు.

గోపాలకృష్ణమూర్తి, శక్కర్‌నగర్.

* * * *

ఆలస్యంగా ఆఫీసుకువచ్చిన "స్టెనో"ను చూచి అధికారి అగ్గి అగయ్యాడు.

"ఇదుగో మిస్! ఏవిటిదీ - యిప్పుడే అడవిలో నుంచి వచ్చిన మృగంలా—"

ఆ భీతమృగేక్షణ క్షణం తెల్లబోయి యీ విధంగా అన్నది-

"లేదు బాస్, ఇప్పుడే అడవిలోకి ప్రవేశించాను!"

జి. కేశవరావు

# తగిన శాస్తి

లింగం సుధాకర్

పూర్వం ఒకఊళ్లో ఒక జమీందారుగారు ఉండేవారు. వాళ్ళ తాతతండ్రులు సంపాదించి పోయిన సంపద జమీందారుగారికి చాలాఉండేది. ఆయన సంపాదించింది ఏమీ లేకపోయినా పూర్వులు సంపాదించి పోయిన ఆస్తిని మట్టుకు చాలా దుబారాగా ఖర్చుచేసేవాడు. జమీందారుగారు ప్రతిరోజూ విందులు, వినోదాలు జరిపేవాడు. ఆవిందుకు వీరు వారని భేదంలేదు. ఇప్పుడుఅప్పుడుఅని వేళ లేదు. లేదన్నమాట అసలు లేనే లేదు. తెలిసినవాళ్ళూ, తెలీనివాళ్లు అందరూ వచ్చేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ ఊళ్లోని ప్రతివాడూవచ్చి విందు లుఆరగించి పోతూ ఉండేవాడు.

ఆయన ఇల్లు ఒక మహాసత్రంగా ఉండేది. భాగ్యవంతులుసైతము ఇతనిని ఆశ్రయించియుండి అతనికరుణకు పాత్రులయ్యేవారు. బెల్లంచుట్టూ ఈగలు ముసురునట్లుగా కవులు, గాయకులు, చిత్రకారులు, స్తోత్రపాఠకులు- వీరు వారనిలేదు అందఱూ అతనిని ఆశ్రయించుకుని ఉండేవారు. ఏ కవి అయినా తను బాగుపడాలంటే, తన కావ్యంవ్యాప్తిలోకి రావాలంటే ఆ కావ్యాల్ని జమీందారుగారికి అంకితం చేస్తేచాలు. ఆయన ఒకపెద్ద ధనం సంచిఇస్తాడు. జమీందారుగారికి అంకితం చేయబడిందికాబట్టి అదిప్రసిద్ధి పొందుతుంది. చిత్రకారుడు ఒకబొమ్మగీచి దానిని ఎవరుకొంటారా? అని విచారింపనక్కరలేదు. దానిని జమీందారుగారి దగ్గరకుతీసికెళ్ళి బాగుందా? అంటేచాలు. ఆచిత్రకారుని జన్మ ఫలించినట్లే. అతనికి ఎవరైనా ఒక బహుమతి ఇచ్చారంటే అతడు దానికి ఏభైరెట్లు విలువగల బహుమానాలను ప్రతిఫలంగా ఇచ్చేవాడు. అతనిచుట్టును రాత్రి,పగలు అనక అనేకులు దొంగమిత్రులు, మోసగాండ్రు, యాచకులు,దొంగ వ్యాపారస్తులు గుమిగూడి అతని పాదాలొత్తి, కల్లబొల్లి మాటలు చెప్పి అతనికరుణకు పాత్రులయ్యేవారు. అయితేపాపం జమీందారుగారు వాళ్ళనందరిని తనమేలుకోరేవారే ననుకొనేవాడు.

అయితే ఈ పనులన్నీ జమీందారుగారి ముసలి దివానుకు నచ్చేవి కావు. ఆయన జమీందారుగారిని అనేకసార్లు బ్రతిమిలాడాడు. హెచ్చరించాడు. "వీరంతా మీ సంపదను చూచి కూడిన స్వార్థపరులు. మీ సంపద ఎప్పుడు సన్నగిల్లుతుందో అప్పుడు వీరు మిమ్ములను విడనాడుతారు" అని. అయితే జమీందారుగారు దివానుమాటలను లెక్క చేయలేదు. జమీందారుగారి మూర్ఖతకు దివాను చాలా విచారించాడు. ఇట్లాకొన్ని దినాలయ్యేసరికి జమీందారుగారి బొక్కసం ఖాళీ అయింది. దానితో జమీందారుగారు ఊరకుండలేదు. తనభూములను అమ్ముతూవచ్చాడు. దివాను ఎంత వారించినా ఫలితంలేక పోయింది. "నేను ధనాన్ని నా స్నేహితులకష్టాలను తీర్చుకోటానికి యిస్తున్నానుగాని, వృథాగా ఖర్చుచేయటంలేదు" అని సమాధానం చెప్పేవాడు. కొన్ని దినాలకు భూములన్నీ అమ్మేశాడు. అయినప్పటికి జమీందారుగారు తన విందులు, వినోదాలు మానలేదు. అప్పుచేయడం మొదలుపెట్టాడు. "నాఅప్పు తీర్చడానికి నాస్నేహితులు సహాయంచేస్తారులే" అనే ధీమాతో విందులు, వినోదాలు మరింత ఉత్సాహంతో చేసేవాడు. ఇంతలోకే జమీందారుగారు దివాళాఎత్తారని క్రమక్రమంగా అందరికి తెలిసింది.

అప్పులవాళ్లు కాట్లకుక్కల్లాగా ఒక్కసారిగా అతనిపైకి వచ్చారు. జమీందారుగారు తన స్నేహితుల సహాయంతో వాళ్ళపీడ సులభంగా వదిలించుకోవచ్చు ననుకున్నాడు. ఎల్లవేళల అతనిచుట్టూ ఈగలవలె మూగి గొప్పధనవంతులుగా మారిన వారిని తనకు సహాయం చేయమని అర్థించాడు. ఏ ఒక్కడూ అతనికి సహాయం చేయకపోగా ఇంకా జమీందారు గారిని పలువిధములుగా దూషింపసాగారు.

ఎప్పుడు చూచినా అతన్ని 'ఇంద్రుడు, చంద్రుడు, దేవుడు' అని పొగడినవారే 'ఉత్త తెలివిమాలిన వాడు. కన్నుమిన్ను కానకుండా డబ్బుపాడుచేసినాడు, అవివేకి' అని జమీందారుగార్ని పరిహాసం చేయ

 

# తగిన శాస్తి



సాగారు. మఱికొందరు "జమీందారు అప్పులపాలై పోవునని నాకు తెలుసు. విందులకు పోయినప్పుడు అతనికి అనేక పర్యాయములు సలహాయిచ్చాను. అతని ఖర్మ. దానికి మనమేమి చేయగలము" అని సులభముగా తప్పించుకొన్నారు. మరికొందఱు కపటమిత్రులు ఇంట నుండియు లేరనిపించి తప్పించుకొనసాగారు. నిన్న మొన్నటిదాకా దారిన పోయేవాడు సహితము జమీందారుగారి యింట విందు ఆరగించని వాడు లేడు. జమీందారుగారిని పొగడనివాడు లేడు. అయితే ఇప్పుడు జమీందారుగారి ఇంటికి ఒక్కడూ రాడు. ఒక్క పొగడ్తా వినబడదు. జమీందారుగారు చూస్తే ఎక్కడ సహాయం అడుగుతాడోనని అతనికంటికి కనిపించకుండా తప్పించుకుని పారిపోయేవారు. దివాను మాటలను విననందుకు జమీందారుగారు చాలా చింతించాడు. పాపం ఆయన తనచుట్టూ మూగినవారి నందరిని నిజమైన మిత్రులే ననుకున్నాడు. దివాను కూడా జమీందారుగారి కష్టదశకు చాలవిచారించాడు. ఓదార్చాడు.

ధూర్తులైన కపట స్నేహితులకు మంచి గుణపాఠం నేర్పాలనుకున్నాడు జమీందారుగారు.

ఉన్నట్లుండి తటాలున ఒకరోజున జమీందారుగారు ఒక గొప్ప విందును ఏర్పాటుచేశాడు. తన పాత మిత్రులందరికి ఆహ్వానాలు పంపాడు విందుకురమ్మని. అతనిమిత్రులంతా చాలా ఆశ్చర్యపడ్డారు. 'దివాళా ఎక్కిన జమీందారు మళ్లా విందులు వినోదాలు ఎట్లా చేస్తున్నాడా?' అని.

"సరే దీని సంగతేమిటో చూద్దాం" అని అందరూ మామూలుగా విందుకువచ్చారు. అంత గొప్పవిందును జమీందారు గారు ఇంతవరకూ చేయనేలేదు. విందుకొచ్చినవాళ్ళంతా అంత బ్రహ్మాండమైన విందునుచూచి కలవరపడ్డారు. అందఱూ తెల్లముఖాలు వేశారు. ఆఖరికి వాళ్ళంతా నిశ్చయించుకొన్న దేమంటే "జమీందారుగారు మన మనస్సులను పరీక్ష చేయడానికి దివాళాఎక్కినట్లుగా నటించాడు. అయితే అసలు ఆయన దివాళా తీయలేదు" అని. వాళ్ళంతా తమ అజ్ఞానానికి చాల నిందించుకున్నారు. పప్పులో కాలేశామే అని విచారించారు. మరల జమీందారుగారిఅనుగ్రహం సంపాదించుకోటానికి తమ క్షమాపణలను చెప్పుకొన్నారు. మీ అక్కరకు మేము తోడ్పడ పోయినందులకు ఏమీ అనుకోవద్దని వేడుకున్నారు.

"మీరు దీన్నంతా మనస్సులో పెట్టుకోకూడదు. నేను మిమ్ములను పరీక్ష చేద్దామని తమాషా చేశాను. అంతేగాని మరేమీ లేదు. నేను దీన్నంతా ఎప్పుడో మరచిపోయాను" అని జమీందారుగారు చెప్పారు. ఇక ఆనాటినుంచి మరల ఎప్పటివలెనే విందులు, వినోదాలు జరగసాగాయి. అతని మిత్రులంతా మరల జమీందారుగారిని ఆశ్రయించారు. ఇట్లాకొన్ని దినాలుగడిచాయి. ఒకరోజున జమీందారుగారు తన దివానును పిలిచి "నా మిత్రులందరి దగ్గరికిపోయి, నేనడిగినట్లుగా చెప్పి, వారిచ్చినంత డబ్బును తీసుకు ర"మ్మనిచెప్పాడు. దివాను సరేనంటూ వెళ్ళి జమీందారుగారి సందేశాన్ని అందరికీ చెప్పాడు. "మరల జమీందారుగారు మనల్ని పరీక్ష చేస్తున్నాడు. ముందు మాదిరిగా కాకుండా ఈసారి అతనిమీద మాకు విశ్వాసమున్నట్లుగా చూపెట్టాలి" అని అందరూ పోటీపడి తమ దగ్గరనున్న ధనాన్నంతా ఇచ్చారు. మఱికొందరు సమయానికి డబ్బులేకపోతే తమ తమ భవనాలను, భూములను అమ్ముకొని, డబ్బుచేసి జమీందారుగారికి పంపారు. జమీందారుగారు ఆ డబ్బునంతాపుచ్చుకొని మొదట అప్పుల వాళ్ళబాధ వదిలించుకున్నాడు. మిగతా డబ్బును తీసుకొని యింకో దూరప్రాంతానికి పోయి పూర్వంలా కాకుండా సుఖంగా బ్రతుకుతున్నాడు.

"మేము ఇన్నిదినాలు జమీందారుగారిని కొలిచినందులకు ప్రతిఫలమన్నా యివ్వకుండా తనిచ్చిన డబ్బంతా తిరిగి తీసుకుపోయాడే" అని అతని దొంగస్నేహితులు చాలా దుఃఖించారు. ఆ దుష్టులకీవిధంగా తగిన శాస్తిజరిగింది. ★

# నిజమైన పాలకుడు

చంపా నగరంలో మాకందుడనే రాజుకు ముగ్గురు కొడుకులున్నారు. తనరాజ్యాన్ని ఆయన చాలా న్యాయంగా పరిపాలించాడు. తన మరణానంతరంగూడ చంపారాజ్యం అతిన్యాయంగా పరిపాలించ బడాలని మాకందుడి ఉద్దేశ్యం. వంశ పారం పర్యం ప్రకారంగా అయితే మాకందుడు తన పెద్ద కొడుక్కి రాజ్యాభిషేకం చేయాలి. కాని చంపారాజ్యాన్ని తనకు మల్లేనే న్యాయంగా పరిపాలింప గల్గిన సమర్థత పెద్దకొడుక్కి లేదు.

ఇలా అనుకొన్న కొన్ని నెలలకు మాకందుడికి మరణ మాసన్నమైంది. ముగ్గుర్నీ తన దగ్గరకు పిలిచాడు. "నేను మీ వయస్సును బట్టి గాకుండా బుద్ధినిబట్టి—ఈ రాజ్యభారాన్ని అప్పగించ దలచాను. కనుక నేను మీకొక పరీక్ష పెడతాను. ఆ పరీక్షలో నెగ్గినవాడికి పట్టాభిషేకము చేస్తాను" అనిచెప్పగా ముగ్గురు కొడుకులు సరే నన్నారు. కాని ఆపరీక్ష ఏమిటో మాత్రం వారికి చెప్పలేదు.

ఆతరువాత నెలరోజులకు ముగ్గురు కొడుకులకు పరీక్ష పెట్టాడు. ఈ నెలరోజులలో మూడు వేటకుక్కల్ని రప్పించి, పదిహేను రోజులు దిట్టంగా ఆహారం పెట్టించి తక్కిన పదిహేను రోజులు ఆహారం లేకుండా ఎండగట్టాడు.

ఒక గదిలో ముగ్గురు కొడుకులకూ మూడు విస్తళ్లు వేయించి పంచభక్ష్య పరమాన్నాలు వడ్డించారు. ముగ్గురూ కూచున్నారు. పదిహేను రోజుల్నుంచి ఆకలిగొని వున్న మూడు వేటకుక్కల్ని ఆగదిలోవదిలిపెట్టారు. అది ఆకలిగొని వున్న కారణాన ఒక్కసారిగా విస్తళ్లమీది కురికాయి. పైగా అవి వేటకుక్కలు. ఆకుక్కల్ని జూచి పెద్దకొడుకు ఒక్కసారిగా భయపడి విస్తరివదలి గది బయటికి పారి

**మంజులత**

పోయాడు. రెండోకొడుకు సమీపంలోవున్న పీట తీసుకొని కుక్క మీద తిరగబడి దాన్ని చావ చితక కొట్టి బయటికి నెట్టేసి—తనవిస్తరి ముందు కూచున్నాడు.

మూడవకొడుకు తన విస్తరి మీద కెగబడిన కుక్కను ఏమీ అనకుండానే ఆహారాన్ని కొంత దానికి గిరవాటు వేశాడు. మిగిలింది తనుతిన్నాడు.

రాజుపెట్టిన పరతు విస్తళ్లలో వడ్డించిన అన్నంతిని బయటికి రావాలని. రెండోకొడుకు మూడో కొడుకు అన్నంముగించుకొని బయటికి వచ్చాడు. రాజు ఇదంతా ప్రక్కనుండి చూచాడు. ముగ్గురు కొడుకులతో ఆ రెండోరోజ మంత్రి సామంతులున్న దర్బారులో రాజు ఇలా చెప్పాడు.— నేను నాకొడుకులకు పరీక్షపెట్టాను. నా చిన్నకొడుకు దానిలో ఉత్తీర్ణుడయ్యాడు. తక్కిన ఇద్దరూ రాజ్యాభిషేకానికనర్హులు. దీనికి కారణమిది.— మొదటివాడు వేట కుక్కను చూచి భయపడి పారిపోయాడు. కనుక పరిపాలనాదక్షత అతనికి లేదనే చెప్పాలి. పిరికివాడు.

రెండోవాడు వడ్డించిన అన్నం తిన్నాడు. గాని, కుక్కను చావమోదాడు. అతడు ప్రజల్ని సక్రమంగా పాలించలేడు.

ఇక మూడోవాడు తనకుతాను తినడమేగాక ఇతరులకు గూడా దాంట్లోభాగం పంచి ఇచ్చాడు. ఇలాంటివాడే ప్రజల్ని సుఖపెట్టగలడు. కనుక నేను నా చిన్న కొడుక్కి పట్టాభిషేకము చేయదలచాను. అనిచెప్పగా దర్బారులో వున్న యావన్మందీ తమ అంగీకారాన్ని తెలియజేశారు.

ఆ తరువాత మాకందుడి చిన్నకొడుకు చంపారాజ్యాన్ని చాల న్యాయంగా పరిపాలించాడు. ★

# విజ్ఞాన వీధులు

"డాక్టర్"

## 204 నిజమంటే ?

విజ్ఞానవీధులు 199 నంబరు ప్రశ్న (ఆంధ్ర సచిత్ర వారపత్రిక 2. 2. 55) లో మేము 'జ్యోతిషము గుడ్డెద్దుతావు. ఇక నిజమంటే ఏమిటి ?' అని ప్రశ్నించాము (మేము అంటే 'డాక్టర్' పదము చే సూచించబడిన విజ్ఞానశాస్త్ర విద్యార్థుల సంఘము ఎవరో ఒక్కరు మాత్రము కారు.) దానిని చూచి ప్రఖ్యాత వైజ్ఞానిక రచయితలైన వసంతరావు వెంకటరావుగారు ఒక వ్యాసము రచించి పంపినారు. దానిలో మూడు పావుటావులు ఎలక్ట్రానుయొక్క నైజము నేటికి తెలియలేదనీ, 'కాంతికిరణాలు, కణసమూహమా ? తరంగ సముదాయమా ?' అన్న ప్రశ్నకి సూటియైన సమాధానము లేదనీ చెప్పుటకు ప్రత్యేకించి, భౌతిక విజ్ఞానం యొక్క ప్రస్తుత స్థితి కల్లోలితమై యున్నదని తీర్మానించినారు. ఆ తరువాతి భాగము మేము వ్రాసిన దానికి సూటిగా సంబంధించినది. అదిది:

జ్యోతిషం నిజమా? దానికాధారాలేమిటి పరిశోధనాగారాలలో ఆశాస్త్రభాగాల మీద ప్రయోగాలు చేయడం లేదన్న కారణంచేత అది శాస్త్రం కాక పోతుందా ?

వాతావరణ విజ్ఞానం (*Meteovology*) ఏమంత నికరమైన శాస్త్రం ? వాతావరణ శాస్త్రజ్ఞులు చెప్పిన జోస్యాలు ఎంతవరకు నిజమౌతున్నాయి ? అంటే, ఆ శాస్త్రాన్ని ఖండించడానికి వేసిన ప్రశ్నలు కావివి. ప్రపంచ వ్యాప్తమైయున్న వాతావరణంలో జరుగుమార్పులు పూర్తిగా గమనిస్తేకాని నికరంగా జోస్యం చెప్పగల అవకాశం లేదు. వాతావరణ పరిశోధనాలయాలు దూర దూరంగా నున్నప్పుడు చెప్పకలిగిన జోస్యంకంటె, వాటిని దగ్గర దగ్గరగా నెలకొల్పి వాతావరణంలో కలుగుమార్పులను సూక్ష్మంగా గమనించి, వాటిని క్రోడీకరించడంవల్ల ఈనాడు చెప్పగలిగినజోస్యం ఎక్కువ సత్యమైంది. అటువంటిదే 'స్టాటిసిక్స్' (*Statistics*). భీమా కంపెనీల కాధారమైన శాస్త్రమేఅది. లక్షలాది వ్యక్తులు ఆదాయాన్ని కాని, జీవిత ప్రమాణాన్ని కాని, వ్యయాన్ని కాని తెలిసికొని, వ్యక్తిగతంగా, సగటున, అవెట్లుండడానికి కవకాశముందో గణిస్తారు. అట్లుచేయగా వచ్చినఫలితం 'సత్య' మని కాదు; అదిఎక్కువ 'సంభావ్యము' అని మాత్రమే. అయితే, విజ్ఞానలోకంలో స్టాటిస్టిక్స్ శాస్త్రమే! అట్లే జ్యోతిషంలో తెలిసికొనవలసిన విషయాలెన్నో ఉన్నాయి. వాటిని ఆధునికవిజ్ఞాన పద్ధతులతో తెలిసికొనలేక పోవచ్చును.

అయితే, వాతావరణ శాస్త్రానికి కొన్ని మూలాధారాలు సిద్ధాంతాలు ఉండగా జ్యోతిషాని కట్టివిలేవంటారు, సాధారణంగా. ఈ అభిప్రాయాన్నే ఎస్ట్రానమర్ రాయల్ అయిన స్పెన్సర్ జోన్స్ వెలిబుచ్చాడు. ఆ నిర్వచనప్రకారం జ్యోతిషం శాస్త్రం కాజాలదన్నాడు. అంతేకాని, జోతిషం నిజమా ? అబద్ధమా ? అను ప్రశ్నలకు జవాబు చెప్పలేదు; జ్యోతిషాన్ని ఖండించనూ లేదు.

ఏదైనా విషయం చర్చించేముందు కొన్ని ప్రాతిపదికలను అంగీకరించాలి; చర్చకు ఆధారాలుండాలి. పంచేంద్రియాల వల్ల లభ్యమైనజ్ఞానంకంటె యంత్రాలమూలంగా భౌతికవిజ్ఞానం సేకరించిన ప్రకృతిజ్ఞానం అపారమని స్పష్టమే. అగోచర కిరణాలనీ, అశ్రుత ధ్వనులనీ, ఇటు సూక్ష్మ ప్రపంచాన్నీ, అటు బృహత్ లోకాలనీ భౌతికయంత్రాల సహాయంతో మానవుడు గుర్తించ కలిగేడు. ఇదంతా భౌతిక విజ్ఞానం. మానవునిలో సూక్ష్మమైన మనస్సుంది. మనశ్శక్తిని పెంపొందించుకొని అతీంద్రియ జ్ఞానాన్ని సంపాదింపవచ్చు; ప్రాచీనులావిధంగా సంపాదించేరు. ఆ సత్యాన్ని అంగీకరించకపోయినప్పుడు చర్చకే తావు లేదు; ఒక్క నమస్కారంతో వ్యాసం ముగించవలసిందే. అయితే, మనస్తత్వం ఈనాడు ఎక్కువ ప్రాధాన్యం వహిస్తోంది. అతీంద్రియ శక్తి విషయమై ప్రయోగాలు చేస్తున్నారు; విజ్ఞానులనేకులు పుస్తకాలు వ్రాస్తున్నారు. మనస్సుకి సంబంధించిన విషయాలను భౌతికోప కరణాలతో పరిశీలించడానికి ప్రయత్నాలుజరుగుతున్నాయి.

జ్యోతిష స్వరూపాన్ని తెలిసికొనడానికి ప్రయత్నించినప్పుడు ఒక్క విషయం స్పష్టమౌతుంది.. గ్రహాలకు, సూర్య చంద్రులకు మానవ జీవితాలపై కొంత ప్రభావముంది. సార్వత్రిక గురుత్వాకర్షణ నియమాన్ని గ్రహించినప్పుడు కాని, రకరకాల విద్యుదయస్కాంత తరంగాలు ద్రవ్యంపై పడినప్పుడు ఆ ద్రవ్యంలో కలిగించే మార్పులను గుర్తించినప్పుడుకాని, సూర్యచంద్రులు భూసముద్రాలలో కలిగించు కల్లోలాలను జ్ఞాపక ముంచుకొన్నప్పుడు కాని, భౌతికవిజ్ఞానపరిచయం గలవారు, మానవులకు గ్రహ సూర్య చంద్రాది నభో మూర్తులకు సంబంధం లేదని అనలేరు. ఆసంబంధాన్ని వివరించేది జ్యోతిషం.

నేటి భౌతిక విజ్ఞానంలోవలె జ్యోతిషంలో సూత్రాలు వివరింపబడలేదు. అంతమాత్రాన్న అవి సత్యం కావనడం సాహసం. జ్యోతిష యాథార్థ్యాన్ని చర్చించినప్పుడు కుహనా జ్యోతిష్కుల ఫలితాలను గాదు ప్రమాణంగా గ్రహించవలసింది. ఆ శాస్త్రంలో పటుత్వముందా లేదా అంటే, అధమం, దానికి అనుభవిక (*Empiricel*) శాస్త్రంపాటి స్థానం లేక పోలేదు. దానిని విస్మరించి తేలికహృదయంతో 'జ్యోతిషము దెబ్బ గుడ్డెద్దుతావు' అని "డాక్టర్" వంటి ప్రాజ్ఞులు నిర్ణయించడం ఆ శాస్త్రానికే అపచారం చేయడమేమో ! మాటకి, పరిశోధనాగారంలో డోలకంతో ప్రయోగం చేసినప్పుడు '$g$' విలువ 1000 సెం. మీ/సెకండు/సెకండు అని వస్తే "డోలక సూత్రాలు తప్పు" అని ఎవరైనా అంటారా?

శ్రీ వెంకటరావుగారి జ్యోతిషశాస్త్రాభిమానాన్ని పాఠకులకు పరిచయంచేయడానికి కేవలము దానికి సంబంధించిన పుటలనే ఇక్కడ వేసినాము. వారితో మేము చర్చించదలచిన దిదే. ఈ నమ్మకానికాధారమైన పునాదులు నిలిస్తే కావలసినంత ఆధునికశాస్త్ర వినోదం చేసుకోవచ్చును. మా మనస్సులలో ఆధునిక విజ్ఞాన పద్ధతులకీ జ్యోతిషశాస్త్ర పద్ధతులకీ నడుమ కంచుగోడలున్నాయి. వారు రెంటినీ కలగాపులగము చేస్తున్నారు. కనుక సూటివాదము సాధ్యముకాదు. వారి అభిప్రాయాలను మరికొంత వివరముగా రాబట్టుటకు మేము కొన్ని సందేహాలడుగుతాము. అప్పుడు మాజాగాలు బయట బడతాయి.

(1) మేము కింద గీటుపెట్టిన అభిప్రాయాలు పరస్పర విరుద్ధంగా నడిచాయి, మొదటిదానికి రెండోదీ. మూడోదానికి నాలుగోదీని.దయచేసి మీకుశాస్త్రం అంటే ఉన్న అభిప్రాయం వివరించండి.

(2) నభోమూర్తులకున్నూ మానవులకున్నూ సంబంధ మున్నదన్నారే ? అది ప్రాచీనులు మనశ్శక్తిని పెంపొందించుకుని అతీంద్రియ జ్ఞానాన్ని సంపాదించుకుని గ్రహించిన దంటారా ? లేక మీవంటి భౌతిక విజ్ఞాన పరిచయం గలవారు గురుత్వాకర్షణా, రకరకాల (!) విద్యుదయస్కాంత తరంగాలూ, సముద్రాల కల్లోలాలూ 'జ్ఞాపక ముంచుకొన్నప్పుడు' మానలేక కనిపెట్టినదంటారా ?

(3) [illegible]గుతావు సామెతకు అర్థము "తగిలి [illegible]తుంది లేక పోతే లేదు" అని. [illegible]్యోతిషానికి అపచారమా ? దయచేసి వివరించండి. ★

# భయం!

(21-వ పేజీ తరువాయి)

త్రాగేందుకు వీలుగా ఉంటుంది." అన్నాడు వెంకటపతి.

"కాఫీహోటల్. చేతినిండా డబ్బూ - బుక్కనిండా పొద్దులూ! ఆల్ రైట్ -" అని ఎగిరి గంతేశాడు సులేమాన్.

మరునాడు ఉదయం రాజయ్య దగ్గరకు వెళ్లి వెంకటపతి కిల్లీదుకాణం తెరిచేందుకు పెట్టుబడిగా ఒక్క యాభైరూపాయలు అడిగాడు, రాజయ్య మారుమాట్లాడకుండా ఇచ్చాడు. ఆ సాయంత్రమే వెంకటపతి సులేమాన్‌ను రామచంద్రయ్య దగ్గరకు పంపాడు: కాఫీహోటలు తెరిచేందుకు పెట్టుబడిగా యాభైరూపాయలు తను అడిగినట్టు తీసుకురమ్మని. రామచంద్రయ్య సంతోషంగా ఆ డబ్బు సులేమాన్ చేతికిచ్చి ఎడిచేత్తో మీసం మీద చేయి వేసుకున్నాడు.

## 4

వెంకటపతి రెండు రోజుల్లో రాజయ్య ఇంటిప్రక్క ఖాళీ ప్రదేశంలో కిల్లీ దుకాణం తెరిచాడు. కొట్టుమీద బావమరిది నాగేశుని అట్టేపెట్టాడు. రాజయ్యకు కించెత్తు మనస్సు చివుక్కుమన్నది. వెంకటపతిని అడిగాడు.

"ఎవడు ఉంటేనేమండి? వాడు నాక్రింద పనివాడుగా వుంటాడు. అంతే! అధికారమంతా నాదే." అన్నాడు వెంకటపతి.

ఆపైన రాజయ్య మాట్లాడలేదు.

కిల్లీదుకాణం తెరిచిన మరి రెండురోజులకు వెంకటపతి రామచంద్రయ్య డాబాలో లైబ్రరీ ప్రక్క హోటల్ కూడా తెరిచాడు. పెద్ద అట్టహాసం ఏమీ లేదు. నాలుగు బల్లలూ, రెండు బెంచీలూ - అంతే, క్రమేపీ హోటలుని అభివృద్ధి చేయవచ్చునని అనుకున్నాడు. క్యాష్ దగ్గర వెంకటపతి - అతను లేనిసమయంలో నమ్మినబంటు సులేమాన్ వుంటాడు.

కిల్లీ దుకాణం తెరిచిన మొట్టమొదటి రోజు దాదాపు పదిరూపాలవరకూ అమ్మకం జరిగింది. వెంకటపతి ఖాతా పుస్తకాన్ని కూడా పెట్టాడు. మున్సబుగారి అల్లుడి చాత మొట్టమొదటి పొద్దు పెట్టించాడు. తరువాత షావుకారుగారి చిన్నబ్బాయి

హోటల్ కూడా బాగా సాగుతోంది. అక్కడా ఖాతా పుస్తకాన్ని మున్సబుగారి అల్లుడి చాత ప్రారంభోత్సవాన్ని జరిపించాడు. ఖాతా పెట్టటంవల్ల ఉండే లాభం దాన్ని వసూలు చేసుకొనే తాహతుగలవాడికి గానీ తెలియదు

రామచంద్రయ్య ఏం తోచనప్పుడల్లా హోటల్లో వొచ్చి కబుర్లాడుతూ కూర్చుంటాడు. ఆయన ఎన్నిసార్లు కాఫీలు త్రాగినా డబ్బు తీసుకోవొద్దని సులేమాన్‌తో వెంకటపతి చెప్పాడు.

రాజయ్యా, రామచంద్రయ్యా నిశ్చింతగా బ్రతుకుతున్నారు. వాళ్లు అట్లాంటి నిశ్చింతమైన జీవితాన్ని డబ్బుతో కొనుక్కున్నారు. గమ్మత్తేమిటంటే, ఇద్దరూ ఆ విషయాన్ని ఎన్నడూ ఆలోచించలేదు. కావటానికి ఇద్దరూ విరోధులు. ఒకళ్ళ బలానికి ఒకళ్లు దడిచి - ఇద్దరూ ఒక వ్యక్తి రక్షణనే అర్థించారు. ఇద్దరి భయాలకూ కారణం ఒక వ్యక్తి, ఇద్దరి ధైర్యాలకూ కారణం ఆ వ్యక్తే!

ఒకరోజు సాయంకాలం రాజయ్య పెద్ద కొడుకు కాలవ కట్టమీద పొలంపని చేసికొని ఇంటికి వస్తూన్న ఒక యువతి పైట చెంగు పట్టుకు లాగాడు. ఆ యువతి కెవ్వన కేకవైచింది. వెనుక అరఫర్లాంగు దూరంలో వొస్తున్న ఇదరు కూలీలు పరుగెత్తుకొనివచ్చి- రాజయ్య పెద్దకొడుకు చేసిన కొంటెపనికి దేహశుద్ధి బాగా చేశారు. రాజయ్య సుపుత్రుడు దెబ్బలకు తట్టుకోలేక గుమ్మంలో బోర్లాపడి - "మా నాన్నతో చెప్పి మీ భరతం పట్టించకపోతే నా పేరు నారాయణే కాదు." అన్నాడు ఆగ్రహంకొద్దీ. రాజయ్య పౌరుషం వాళ్లకు తెలుసు. కాని ఈమధ్య ఆయనకు ఉన్న అండ వాళ్ళకు తెలియనిమాట వాస్తవం. నారాయణ అన్నంతపనీ చేశాడు. జరిగిందానికి జరగని విషయాలు కొన్ని కల్పించి - రాజయ్యతో చెప్పాడు. రాజయ్య కోపావేశాన్ని ఆపుకోలేక వెంటనే వెంకటపతితో చెప్పాడు. తన బలాన్ని వెంకటపతిద్వారా ఊళ్లో వాళ్ళకి చూపించడం రాజయ్యకు ఇదే ప్రథమం.

వెంకటపతి మరునాడు సాయంకాలం సులేమాన్ నాయకత్వంక్రింద ముగ్గురు రౌడీలను కాలువకట్టకు పంపించి - ఆ ఇద్దరి కూలీలనూ కొట్టించాడు. ఈ విషయం ఆ రాత్రే ఊళ్లో చాలమందికి తెలిసిపోయింది. రాజయ్య గర్వించాడు. నారాయణ తన ప్రయోజకత్వానికి తానే మురిసిపోయాడు.

ఆరోజు ఉదయం రామచంద్రయ్య భార్య నరసమ్మకూ, ప్రక్కయింటి ఇల్లాలు సీతమ్మకూ పందిరిక్రింది పొట్లకాయ దగ్గర పోట్లాట వొచ్చింది. సీతమ్మ కొడుకు ఆ పందిరిక్రింది పొట్లకాయ పిందెను త్రుంచివేశాడు, ఆటకాయతనంగా. అది చూసిన నరసమ్మ వాడి వీపుమీద ఒక్క చురక తగిలించింది. ఆ చురకకు వాడు ఇల్లు దద్దరిల్లేట్టు కేక వేశాడు. సీతమ్మ తన కొడుకు మీద నరసమ్మ సలిపిన దౌర్జన్యాన్ని తీవ్రంగా ఖండించటంతో - వాళ్లి తగవు ఆరంభమై, క్రమేపీ తమతమ గత చరిత్రలలోని కుళ్లును నిర్మొహమాటంగా బయట పెట్టుకొనేస్థితికి వొచ్చారు. నరసమ్మే తన 'దండకం'లో ముందడుగు వేయటంతో సీతమ్మకు రోషం ఎక్కువై - ఏడ్పుముఖం పెట్టింది. ఆ సమయంలో సీతమ్మ మొగుడు రామసుబ్బయ్య వొచ్చాడు. తనభార్యను నరసమ్మ తిట్టే తిట్లను సహించలేక -

"అట్లా నోరు పారేసుకుంటూ వెందుకమ్మా! నువ్వు తిట్టేతిట్లకు అర్థాలుతీస్తే - నువ్వు మనిషివై ఎందుకుపుట్టావో అర్థం కాదు. చీమూ, నెత్తురూ ఉన్న మనిషి, నిత్యమూ అన్నంతినేమనిషి, కాపురం చేస్తాన్న ఆడది - తిట్టేతిట్లా అవి?" అని కలుగజేసుకున్నాడు.

నరసమ్మకు తమ ఆడవాళ్ళపోట్లాటలో మగవాడు కలుగజేసికోవటం - మహా చెడ్డ చిరాకును, కోపాన్ని తెచ్చిపెట్టింది. సరిగ్గా అదేసమయంలో రామచంద్రయ్యకూడా బజారునుంచి వొచ్చాడు.

"చూడండి! చూడండీ! పెద్దమనిషి ఆడవాళ్లతగవులో జోక్యం కలుగజేసుకొని, తన పెళ్ళాన్ని వెనుక వేసుకువస్తూ - నన్ను ఎట్లా ఆడిపోస్తున్నాడో! మీరూ మగవారై యుండి ఈ అన్యాయాన్ని, మీ భార్యకు జరిగే ఈ అవమానాన్ని ఎట్లా సహిస్తారు?" భర్తలో వేడిని రగిలించింది నరసమ్మ.

రామచంద్రయ్య ముఖంలో కోపం నిప్పులు చెరిగింది.

"ఏమిటే! రామసుబ్బయ్యా! అంత తెగించి మాట్లాడుతున్నావా? నేను ఎవర్ని అనుకున్నావ్? ఇదివరకటి రామచంద్రయ్య ననుకున్నావా? జాగ్రత్త!" అన్నాడు దౌర్జన్య ధోరణిలో.

రామసుబ్బయ్యలోని కోపం రబ్బరుబొమ్మలోని గాలి తగ్గినట్లు ఒక్కసారి తగ్గింది. రామచంద్రయ్య వెనుక అండగా నిలిచియున్న వెంకటపతి గ్రూపును స్ఫురణకు తెచ్చుకొని రామసుబ్బయ్య నీరు అయిపోయినాడు.

"పద ఇంట్లోకి. సిగ్గులేక-" అని భార్యను కసురుతో ఇంట్లోకి వెళ్ళాడు.

రామచంద్రయ్య వెంకటపతిని తలుచుకొని, నిండుగా నవ్వుకున్నాడు - తనంటే వీళ్లకి ఎంత భయం!

భర్తమాటలకు చవటదద్దమ్మగా మారిపోయిన సీతమ్మ మొగుడ్ని చూసి సంతోషించి, భర్తవంక గర్వంగా చూసింది. 'మనమంటే ఏమనుకున్నావ్?' అన్నట్టు రామచంద్రయ్య భార్య ముఖంలోకి చూశాడు.

వెంకటపతితో రాజయ్యా, రామచంద్రయ్యలు స్నేహంగా ఉండటము ఊళ్లో చాలమందికి జుగుప్సని కలిగించిందన

టంలో ఆశ్చర్యంలేదు. ఆ రౌడీ ఆసరా చూసుకొని వాళ్లిద్దరూ తమ తమ అధికారాలను అనుభవంలోకి తెచ్చుకొనేందుకు ప్రయత్నిస్తూన్న కొద్దీ—ఊళ్ళో వాళ్ళకి వాళ్ళమీద కోపమూ, అసహ్యమూ, ప్రతీకారం తీర్చుకోవాలనే భావమూ కలగడంలో కూడా వింత లేదు.

కాని మళ్ళా రాజయ్యా, రామచంద్రయ్యలు ఇద్దరూ ఒకచోట తటస్థపడి మాట్లాడుకోవడం ఎన్నడూ జరగలేదు.

## 5

బయట కుక్క అరవటంతో ఆ అర్ధరాత్రి రాజయ్యకు గబుక్కున మెలకువ వచ్చింది. ఆయన వంచెసాలోలో పడుకుంటాడు. మెలకువ రావటంతో మంచంమీద కూర్చుని చుట్టూ చూశాడు. బయట కుక్క అరుస్తూనేఉంది. వెన్నెల మాసిపోతుంది. చూస్తూండగానే ఒక వ్యక్తి గేటుమీద నుంచి గోడ ఎక్కి, కొబ్బరిచెట్టుమీదుగా క్రిందికి దిగి వచ్చాడు. రాజయ్య ప్రాణం కడబట్టింది. నరాలు సడలిపోయినై. శరీరం కదులాడ నారంభించింది. వాడెవరు? దొంగ!—దొంగ! అరవాలని నోరు తెరిచాడు. కాని మాట వొస్తేనా? గతిలేక ముడుచుకు పడుకొని ముసుగు నిండా కప్పుకొని – ఆంజనేయ దండకం వల్లెవేయనారంభించాడు.

కొద్ది నిముషాలకు ముసుగు కప్పుకొన్న ఆయన శరీరంమీద ఒక బలమైన చేయి పడ్డది. గుండెల్లో పరుగెత్తే రైళ్లు ఆగినయ్. ఊపిరి స్తంభించింది. ప్రాణం పోయిందా? హఠాత్తుగా గుండె ఆగిపోయిందా?

ఆ చేయి మృదువుగా తట్టి లేపుతూన్నది.

"రాజయ్యగారూ! రాజయ్యగారూ!"

...............

"రాజయ్యగారూ!"

రాజయ్య ఆ కంఠాన్ని గుర్తుపట్టాడు. ఆ కంఠం వెంకటపతిది. వాడెందు కొచ్చాడు? దౌర్జన్యంగా తనదగ్గర డబ్బు దోచుకెళతానికి వొచ్చేడేమో!

"రాజయ్యగారూ! లేవండి. మీతో ఒక అత్యవసరమైన పనుండి వచ్చాను."

రాజయ్య ముసుగు తొలగించి లేచి కూర్చున్నాడు. ఆయన గుండెలోని దడదడ ఇంకా పుల్‌స్టాప్ జరగలేదు.

"ఏంపని?"

వెంకటపతి పంచె మాటునుంచి ఒక బంగారు కంటె తీశాడు.

"ఇది మీదగ్గర దాచండి. రేపువొచ్చి తీసుకువెళతాను!"

బంగారు కంటె దొంగిలించి ఉంటాడు. తను దాచటమా? ఎంత ప్రమాదం? తను ఈ వ్యూహంలో ఇరుక్కోరాదు.

"నాదగ్గర వేనికి. ఇది దొంగసొమ్ము. నాకు ముప్పువొస్తుంది." రాజయ్య గడగడ వొణికిపోయాడు.

"మీకేం ప్రమాదం రాదు. నేను హామీ వుంటాను."

"కాదు. నాకు వొద్దుబాబూ! నాకు అసలే ఎందుకో భయంవేస్తూంది"

"ఏం భయంలేదు. నేను ఉన్నంతవరకూ మీకు భయం ఎప్పుడూ అక్కర్లేదు. నన్ను చూస్తే ఈ ఊరంతా గజగజలాడుతుంది. నామాటకు ఈ ఊళ్లో ఎదురుచెప్పేవాళ్లు లేరు. నేను చేసినపనిని ఆక్షేపించటానికి ఎవరికీ దమ్ములులేవు. మీకేం భయపడనవసరంలేదు"

"కాదు. ఎందుకైనా మంచిది! నీ దగ్గరే అట్టే పెట్టుకో, నేను పిరికి వాడ్ని. ఈ పాపపు సొమ్మును ఇంట్లో పెట్టుకు కాపాడలేను."

"రాజయ్యా! జాగ్రత్త! నామాట కాదనటానికి నీ కెన్ని గుండెలున్నాయ్? ముందు ఈ కంటెను ఇంట్లోదాచు. నాకు కోపం తెప్పించి, ఆ కోపంయొక్క ఫలితాన్ని రుచిచూడాలని ఉబలాటపడుతున్నావా?" వెంకటపతి కంఠంలోని కార్కశ్యానికి రాజయ్యలో భయం బుసలు రేగినట్టు రేగింది.

"తీసుకో ఈ కంటె" వెంకటపతి గర్జించాడు.

రాజయ్య దేవునిమీద భారం వుంచి ఆ కంటెను తీసుకున్నాడు. వెంకటపతి వెంటనే ఇల్లుదాటి వెళ్లిపోయాడు. వెన్నెల మాసిపోయిన చీకటి దట్టమైంది.

వెంకటపతి వీధిలోంచి వెళుతున్నాడు. ఎవ్వరూ ఒక్క వ్యక్తి కూడ లేడు, వీధిలో. అతను రావిచెట్టు బజారుకేసి వెళ్లాడు. అర్ధరాత్రి దాటివుంటుంది. రావిచెట్టుక్రింద సులేమాన్, రామిగాడు ఉన్నారు. వెంకటపతి వాళ్లతో చెట్టునీడన ఏవో కొంచెంసేపు మాట్లాడాడు. తరువాత వెంకటపతి రామచంద్రయ్య ఇంటికేసి వెళ్లాడు.

తలుపు కొట్టగా రామచంద్రయ్య వొచ్చి తలుపు తీశాడు. ఇంట్లో అందరూ గాఢనిద్రలో ఉన్నారు. వెంకటపతిని చూడటంతో భయంతో వొణికిపోయాడు.

"ఏమిటి? ఇంత అర్ధరాత్రి ఎందుకు వొచ్చావు?"

"మీరు నాకు ఒక సహాయం చేయాలి?"

"సహాయమా? ఏమిటి?"

వెంకటపతి ప్రక్క జేబులోంచి ఒక రాళ్ళ నెక్‌లెస్ తీశాడు, మసక చీకట్లో ఆ నెక్‌లెస్ ధగధగ మెరిసిపోతోంది.

"ఈ నెక్‌లెస్‌ను మీరు ఈ రాత్రికి దాచాలి."

రామచంద్రయ్య గుండెలు అవిసిపోయినాయి. కాళ్ళల్లో పట్టు తప్పిపోయింది. చెమటతో చొక్కా తడిసింది. అది దొంగసొమ్మని ఆయనకు తెలుసు. తెలిసివుండి కూడా దొంగసొమ్ము దాచడానికి ఎవడు సాహసిస్తాడు?

"అది నావల్ల కాదు బాబూ! ఇంకెవరి దగ్గరనా దాచిపెట్టు" ప్రతిమాలాడు రామచంద్రయ్య.

"కాదు. మీమీద నాకు నమ్మకంఉంది. ఈ వస్తువును మీరు తప్పకుండా దాచాలి."

"నేను పిరికివాడ్ని. నాకు అమితంగా భయం వేస్తోంది. ఈ పని నే చేయలేను బాబూ!"

"ఏం భయం లేదు. నేను ఉన్నంతవరకూ మీకు భయం ఎప్పుడూ అక్కర్లేదు. నన్ను చూస్తే ఈ ఊరంతా గజగజలాడుతుంది. నా మాటకు ఈ వూళ్లో ఎదురుచెప్పేవాళ్లు లేరు. నేను చేసిన పనిని ఆక్షేపించటానికి ఎవరికీ దమ్ములు లేవు. మీకేం భయపడనవసరం లేదు."

"ఏమో! కాలం బాగుండలేదు. వెంకటపతీ దయయుంచి నన్ను వొదలిపెట్టు."

"అంతేనా?"

"అంతే!"

"నేనంటే ఏమిటో మీరు మర్చిపోతున్నారు. నన్ను కాదని మీరు ఈఊళ్లో ఏమాత్రం బ్రతకగలుగుతారో చూస్తాను" అన్నాడు వెంకటపతి కళ్లల్లో నిప్పులు కురుస్తూ.

ఆ చివరివాక్యానికి రామచంద్రయ్య భయంతో కంపించిపోయాడు. వాడు అంతకీ తగినవాడు. తెగించినవాడు ఏమైనా చేస్తాడు! తను దాస్తే ఏంపోతుంది? ఎటుగూడా రేపు తీసికొని వెళతాడుగా!

"నాతో విరోధం తెచ్చుకొని మీ బ్రతుకును మీరు పాడుచేసుకోకండి" అన్నాడు వెంకటపతి గంభీరంగా.

రామచంద్రయ్య దేవునిమీద భారంవేసి ఆ నెక్‌లెస్‌ను దాచేందుకు అంగీకరించాడు.

"రేపు పగలువొచ్చి పట్టుకుపోవాలి. అప్పటివరకు జాగ్రత్తగా దాచుకో!"

"అలాగే!" వెంకటపతి వెళ్లిపోయాడు.

రామచంద్రయ్య తలుపులు గట్టిగాబిగించి ఆ నెక్‌లెస్‌ను ఇనుపభోషాణంలో పెట్టాడు చప్పుడు కాకుండా.

మరునాడు ప్రొద్దున తొమ్మిదిగంటలకు ఊళ్ళో పోలీసులు దిగారు. వాళ్లు రావటంతో వెంకటపతి ఇంటిని ముట్టడివేశారు. వెంకటపతి లేడు. సోదా వేశారు – పోయిన వస్తువులు దొరకలేదు.

ప్రక్కగ్రామంలో షావుకారుగారి ఇంట్లో రాత్రి దొంగతనం జరిగింది. ఆ

# అపస్వరాలు

## (16-వ పేజీ తరువాయి)

చివరికి సత్యమే, "ఈ ఆకుపచ్చ నీకు బాగుంటదే!" అన్నాడు. అప్పటికి బేరం తెమిలింది.........ఆలోచనల్లోంచి మేల్కొంది దామె.

రత్తమ్మ గుడినించి మెల్లిగా కిందికి దిగుతోంది.

మధ్యాహ్నం పెళ్ళివిందు నిరాడంబరంగానూ క్లుప్తంగానూ జరిగింది.

ఆ రాత్రే, వధూవరుల్ని ఓ గదిలోకి నెట్టారు. రత్తమ్మకి లోలోపల సంతోషంగా వున్నది. కాని సిగ్గు. సత్యం కొంచెం చొరవతీసుకుని ఈ సిగ్గు వొదిలించి, ఆమెని దనువుగా మంచం మీద కూచోబెట్టాడు.

బెడ్ రూం లైటుకి ఆకుపచ్చ చిమ్నీ పెట్టారు. గదంతా మసక వెల్తురునిండి మగతగా వుంది. మట్టిగోడలమీద రంగుల కంపెనీల కాలెండర్లు వేళ్ళాడుతున్నాయి. అందులో ఒకటి రాధ, కృష్ణుణ్ణి ఊహిస్తూ, నీళ్ళు తోడుతున్న దృశ్యం. అది చూసి రత్తమ్మ నవ్వింది.

"ఏంది నవ్వుతున్నావ్!" అన్నాడు సత్యం, ఆమె జడ సవరిస్తూ.

"ఆ కృష్ణుడిబొమ్మచూస్తే, మా మావ జ్ఞాపకం వొచ్చాడు. వరదరాజుమామ! ఆడివన్నీ కొంటెపనులు! మొదలుమొదలు ఆణ్ణి చూస్తే నాకెందో మా బయమేసేది! కొసకినూస్తే అంత మంచోడు లేడనిపించాడు!" అని ఆశ్చర్యపడ్డది.

"పైకి అట్టానేవుంటారు కొందరు. తీరాచూస్తే అంత మంచివాళ్ళు ఇంకొకళ్ళు లేరనిపిస్తారు...మీఅక్క చూడరాదు! ఎంతో మంచిదనుకున్నావా చివరికి!..."

సత్యంవాక్యం పూర్తిచెయ్యకముందే రత్తమ్మ అతని నోరు మూసింది; "అక్కనిఅనకండి! దానేముంది? ఆశాస్త్రి లేడూ! ఆడు బలవంతంచేస్తే వొప్పుకుని వుంటదండి. ఇప్పుడు నూశినా! అటు వరదరాజుకి చెడ్డదయింది. ఇటు శాస్త్రికి చెడ్డది...నాకే...మరే ...ఇంకో అనుమానంగూడా వుంటదండి..."

"ఏమిటది?" సత్యం ప్రశ్నించాడు, విశాలమైన ఆమె కళ్ళల్లోకి ఆసక్తిగా చూస్తూ.

"మా అక్కే-మావని, మంచంకింద పడుకోబెట్టిందేమోనని!" అంది రత్తమ్మ. ఎలాగో అక్కని సమర్థించాలని ఆమెవుద్దేశం.

"అట్లా కాదు...అయితే వరదరాజు మీ అక్కని వొదిలేసి దేనికి పోయిండు! అశ—పూరుకోవే! అక్కని మా వెనకేసు కొస్తుండవు." అన్నాడు సత్యం, ఇక సంభాషణ చాలించమన్నట్టు.

ఇద్దరి లేతహృదయాలూ ఆరాత్రి పవిత్రంగా ఏకమైనాయి. ఏ డబ్బూ, ఏ విలువలూ తెచ్చిపెట్టలేని, ప్రకృతిసిద్ధమైన ఆనంద జ్యోత్స్న వాళ్ల అంతరాంతరాలలో వెలిగింది.

(ఇంకా వుంది)

---

దొంగతనం వెంకటపతి తాలూకు మనుషులు చేశారని ఆమాక్కి తెలిసింది. వెంటనే పోలీసులు దిగారు.

పోలీసులు సులేమాన్ఇంటినికూడాసోదా చేశారు. సులేమాన్ లేడు, వస్తువులుకూడా లేవు. ఇంకా వెంకటపతి రౌడీజట్టులోని ఇద్దరు ముగ్గురు రౌడీల ఇళ్ళనుకూడా సోదా చేయటం జరిగింది. కాని ఏమీ లాభం లేక పోయింది. వాళ్లువస్తువులతో పరారీ అయినారా? లేక ఆ వస్తువుల్ని ఊళ్లో దాచి వొట్టిమనుష్యులే పరారైనారా? అన్న ప్రశ్న మేధావంతుడైన ఆ సబ్ ఇనస్పెక్టరుకు కలిగింది. అక్కడ గుమికూడిన మనుష్యుల్లో ఒకతన్ని ఆ విషయమై సబ్ఇనస్పెక్టరు ప్రశ్న వేశాడు.

ఆమనిషి ఎవరో కాదు - ఒకప్పుడు రామచంద్రయ్యకు దశిచిన రామసుబ్బయ్యే!

"ఆ దొంగలకు చేదోడు వాదోడుగా ఈ ఊళ్లో ఇద్దరు ఆసాములు ఉన్నారు. వాళ్లు ఇళ్లు సోదాచేస్తే మీ వస్తువులు దొరకవచ్చు."

"ఎవరు వాళ్లు?"

"రాజయ్యా - రామచంద్రయ్యా!" ఆ గుంపులో ఇంకోవ్యక్తి చెప్పాడు. ఆ ఇద్దరిమీద ఊళ్లో చాలమందికి ద్వేషం ప్రబలిపోయింది.

సబ్ఇనస్పెక్టరు పోలీసులతో సహా వెంటనే ఆ ఇద్దరి ఆసాముల ఇళ్లు సోదా చేయగా- బంగారు కంటె, రాళ్ళ నెక్లెస్ దొరికాయి. మిగతా వస్తువుల్ని గురించి తమ కేమీ తెలిదనీ, రాత్రి ఆ వస్తువులు వెంకటపతి యిస్తే దాచేందుకు తీసుకున్నామని చెప్పారు. దొంగవస్తువులు ఎందుకు పుచ్చుకున్నారని సబ్ఇనస్పెక్టరు వేసిన ప్రశ్నకు - రాజయ్యగానీ, రామచంద్రయ్యగానీ ఏం సమాధానం చెప్పలేదు. ఇద్దరికీ తెలుసు: భయంవల్లనని. ఆ విషయాన్ని నలుగురులో చెప్పుకునేందుకు వాళ్లు సిగ్గు పడ్డారు.

"వాళ్ల చేతులకు బేడీలు తగిలించండి" అన్నాడు సబ్ఇనస్పెక్టరు పోలీసుల్ని ఉద్దేశించి.

"ఇది ఏం కర్మరా భగవంతుడా!" అనుకున్నారు రాజయ్యా, రామచంద్రయ్యలు పోలీసులు చేతులకు బేడీలు తగిలిస్తుంటే!

"చేసుకున్న కర్మ!" అన్నారు అక్కడ ఉన్నవాళ్లంతా.

రాజయ్యనూ, రామచంద్రయ్యనూ - చేతులకు బేడీలు తగిలించి నడి బజారులోంచి తీసుకువెళుతోంటే, ఊళ్లో ప్రజలంతా విరగబడి చూశారు. ★

---

# గ్రంథసమీక్ష

**దేవుడు ప్రత్యక్షమైతే!** — నాటికలు; రచయిత: కంచిభట్టకృష్ణమూర్తి; ప్రతులకు: (కె. బి. కృష్ణమూర్తి, అడ్వొకేట్, ఆంధ్ర హైకోర్టు) వెల 1-0-0. ఈ సంపుటిలో దేవుడు ప్రత్యక్షమైతే, పెళ్ళిసంబంధాలు, బీప్, ప్రయివేటుమాస్టర్ అనే నాలుగు నాటికలున్నాయి.

**బాలగేయాలు:**—రచయిత 'రఘు'; వెల 0-4-0; ప్రతులకు: ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి. ఈ చిన్న సంపుటిలో 15 గేయాలున్నాయి. ఇవన్నీ పిల్లలకోసం చమత్కారపూరితంగా వ్రాసిన చక్కని గేయాలు. దినదినప్రవర్ధమానమవుతున్న బాలసాహిత్య ప్రచురణలకు కొక ఈ సంపుటి ఒక ఉదాహరణ.



గోకుల్ పిక్చర్సువారి "వదినగారి గాజులు"లో చలం, జమున.

# బొంబాయి సినిమాలేఖ:

## ఢిల్లీలో పాతచిత్రాల ప్రదర్శనం

భారతీయ టాకీచిత్రాల లెక్క ప్రకారం గతమైన మార్చి 14 న రజతోత్సవం జరుపకపోవడం భారతీయ ఫిలిం పరిశ్రమ సంప్రదాయాలకు అనుగుణంగానే వున్నది. కాని వ్యాపారసంస్థ కానే కానటువంటి ఢిల్లీ సాంస్కృతిక చలనచిత్ర సంఘం మాత్రం రజతోత్సవం జరపడం హర్షకారణంగా వున్నది. ఆ సంఘంవారు అనాడు భారతీయ చలనచిత్రాలలో ఉత్తమమైన నాటిని వీరి ఉత్సవాన్ని ఏర్పాటు చేశారు. కేంద్ర సమాచార, బ్రాడ్‌కాస్టింగ్ శాఖల మంత్రి డా॥ బి. వి. కేస్కార్ ఉత్సవాన్ని ప్రారంభించారు. భారతీయ ఉత్తమ చిత్రాలను పరిశీలించి చూస్తే, ఆదర్శప్రాయమైన చిత్రాలుకూడా ఆర్థిక విజయం పొందడానికి వీలుందని విశదమవుతుందని డా॥ కేస్కార్ అన్నారు. 1938 లో బోంబే టాకీస్‌వారు తీసిన "వచన్"లో ఉత్సవం ప్రారంభమైంది. ఈ ఉత్సవం రెండు నెలలపాటు సాగుతుంది. ప్రతి శని ఆదివారాల్లోనూ ఒక్కొక్క పాత ఉత్తమ చిత్రం ప్రదర్శింపబడుతుంది. సొహ్రాబ్ మోడీ చిత్రం "పుకార్" (చంద్రమోహన్, నసీం—1939) బోంబే టాకీస్ వారి "ఇజ్జత్" (దేవికారాణి, అశోక్‌కుమార్ — 1937) సొహ్రాబ్ మోడీ తీసిన "సికందర్" (పృథ్వీరాజ్, వనమాల-1941) శాంతారాం తీసిన "అమర్‌జ్యోతి" (దుర్గాఖోటే, చంద్రమోహన్—1936) విజయభట్ తీసిన "రామరాజ్య" (ప్రేమ్ అదీబ్, శోభనా సమర్థ—1941) మొదలైన చిత్రాలు చూపబడతాయి.

ఈ సందర్భంలో మొదటి భారతీయ టాకీ చిత్రం "ఆలం ఆరా" చూపబడక పోవడం దురదృష్టం. ఆ చిత్రం కాపీ ఒక్కటైనా దొరకలేదు. ఆ చిత్రం నిర్మాత అర్దేశిర్ ఇరానీ ఇంకా సజీవుడుగా వున్నా, ఆయన జ్యోతీస్టూడియోను నిర్వహిస్తున్నవారు ఆ చిత్రాన్ని గురించి శ్రద్ధ తీసుకోకపోవడం విచారకరం.

* * *

బొంబాయి సినిమాలోకంలో హోలీ పండగ చాలా సరదాగా నడిచింది. రాజ్ కపూర్, నర్గీస్, అశోక్‌కుమార్, కిశోర్ కుమార్, నిరూపరాయ్, గీతారాయ్, మోహనా, సృతివిశ్వాస్, అనితాగుహ,



"చాందినీచౌక్" చిత్రంలో శేఖర్, స్మృతిబిశ్వాస్

## ★ ఢిల్లీలో పాతచిత్రాల ప్రదర్శనం ★

దిలీప్‌కుమార్ మున్నగువారలు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. ఆర్. కె. స్టూడియోలోను, ప్రాణ్, దిలీప్‌కుమార్‌ల గృహాల్లోనూ ఉత్సవం తాలూకు ఉత్సాహం బాగా కనిపించింది. పాటకచ్చేరీలుకూడా జరిగాయి.

*   *   *

సినీతార మోహనా ఇటలీనుంచి తిరిగివచ్చి ఇప్పుడు బొంబాయి చిత్రాల్లో పని ప్రారంభించింది. ఈమె కొన్ని ఇటాలియన్ చిత్రాల్లో కూడా నటించింది. ఈమెనుగూర్చి విదేశాల పత్రికలు "జేన్‌రసెల్ ఆఫ్ ఇండియా" అని వ్రాసినవి. ఇప్పుడీమె లాక్ష్మీ ఫిలిమ్స్‌వారి "తీర్ అందాజ్" లో నటిస్తోంది. ఆమెగాక మధుబాల, అజిత్, చంద్రశేఖర్, జైరాజ్, కులదీప్ కౌర్, సుందర్ కూడా అందులో నటిస్తున్నారు. మోహనా చేసిన చక్కని నాట్యాలు ఆ చిత్రంలో చూడవచ్చును. అదిగాక ఆమె తన మాతృభాషైన అయిన కొంకణిలో ఒక చిత్రం తీయబోతోంది.

నితీన్‌బోస్ "అశ్రు" అనే చిత్రం తీస్తున్నాడు. "మహల్" లో కలిసి నటించిన అశోక్‌కుమార్, మధుబాల ఇందులో తిరిగి జతగూడి నటిస్తున్నారు. పథ్ నిర్దేశ్ అనే శరత్ నవలను అనుసరించిన కథతో ఈ చిత్రం నడుస్తుంది. ఈ చిత్రం ప్రారంభోత్సవం ఫిబ్రవరిలో జరిగింది.

*   *   *

## శ్రీమతి 420

రాజ్‌కపూర్ చిత్రం "శ్రీ 420" ఆఖరు ఘట్టంలో ఉంది. అందులో రాజ్, నర్గీస్ నటిస్తున్నారు.

ఈలోగా దర్శక నిర్మాత జి. పి. సిప్పి "శ్రీమతి 420" అనే చిత్రాన్ని మార్చి 19 న ప్రారంభించాడు. అప్పుడే సగం చిత్రం తయారైంది. హాస్యనటి మీనాషోరీ, అజిత్, జానీ వాకర్ నటిస్తున్నారు.

*   *   *

కీరాఖాయ్ జెకాయ్ తీస్తున్న "టాంకీ కా జేలీ" చిత్రంలో నిరూపరాయ్ పురుష వేషంలో కనిపిస్తుంది. కరణ్ దివాన్, లలితా పావర్, బి. ఎమ్. వ్యాస్, యశోధరా కట్జూ, కామ్సన్, ఇందిరా బన్సాల్ మున్నగువారుకూడా నటిస్తున్నారు.

*   *   *

దాగ్, పతిత చిత్రాలు నిర్మించిన అమియచక్రవర్తి "సీమ" అనే చిత్రం ప్రారంభించాడు. నూతన్, బల్రాజ్ సాహ్నీ నటిస్తున్నారు. స్విట్జర్లెండునుండి తిరిగివచ్చినప్పటినుండీ నూతన్ తాను నటించే పాత్రలనుగూర్చి, చిత్రాలనుగూర్చి ముందే బాగా తెలుసుకునివ్వం చేతప్ప ఒప్పుకోవడంలేదు. పైగా ఒకేసారి మూడుచిత్రాల్లోకంటె ఎక్కువవాటిలో నటించరాదని ఆమె నిశ్చయించుకున్నది.

"మీనార్" చిత్రంనిర్మించిన ఆర్. చంద్ర మరొక పెద్ద సంగీతచిత్రం "బసంత్ బహార్" తీయడానికి సంకల్పించారు. ఈ చిత్రం అసలు పేరును సెన్సార్లభయంవల్ల ఆయన ఇంకా బయటపెట్టలేదు. టిప్పుసుల్తాన్ కాలంలో మైసూరులో ప్రసిద్ధగాయకుడైన

# సినిమా వార్తలు

చక్కని కరుణరస చిత్రం "మా గోపి" నిర్మించిన విక్రమ్ ప్రొడక్షన్స్‌వారు ఈసారి హాస్యచిత్రం "తెనాలి రామకృష్ణ" నిర్మిస్తున్నారు. పెద్ద తారాబలంతో తీయబడుతున్న ఈ చిత్రానికి దర్శకుడుగా, నిర్మాతగా, ఫొటోగ్రాఫరుగా బి. ఎస్. రంగా పనిచేస్తున్నారు. తెనాలి రామకృష్ణుడుగా ఎ. నాగేశ్వరరావు నటిస్తున్నాడు. ఇంకా ఎన్. టి. రామారావు, నాగయ్య, భానుమతి, జమున, ఆర్. బాలసరస్వతికూడా నటిస్తున్నారు. భానుమతి కృష్ణ అనే నర్తకి పాత్ర ధరిస్తుందట. పాటలు, మాటలు సముద్రాల రచిస్తున్నారు. ఉగాదినాడు రేవతీలో ప్రారంభోత్సవం జరిగింది. డైరెక్టర్ ప్రసాద్‌గారు కామెరా 'స్విచ్ ఆన్' చేశారు.

ఇదే చిత్రాన్ని రంగాగారు తమిళంలో కూడా శివాజీ గణేశన్, నంబియార్, ఎన్. కృష్ణన్, భానుమతి మున్నగువారితో తీస్తున్నారు.

*　　*　　*

"శ్రీ కృష్ణతులాభారం" చిత్రాన్ని ఎస్. వరలక్ష్మి, రేలంగి, నారిబాబు, రఘురామయ్య మున్నగువారితో తీయనున్నట్లు శ్రీ రాజరాజేశ్వరీ వారొక ప్రకటన చేశారు.

*　　*　　*

అంజలీ పిక్చర్స్‌వారు తమ "అనార్కలి" చిత్రం ఏప్రిల్ 28 న విడుదల చేయనున్నట్లు ప్రకటించారు.

## "ది ఈజిప్షియన్"

ఏప్రిల్ 1 శుక్రవారంనుంచి న్యూగ్లోబ్ థియేటర్‌లో ప్రదర్శిస్తున్న ట్వెంటియత్ సెంచరీఫాక్స్‌వారి సినిమాస్కోప్ - డీలక్స్ కలర్ - చిత్రంలో కథ 'ది ఈజిప్షియన్' క్రీస్తుకు పూర్వం 13 శతాబ్దాల వెనుకటి చరిత్రకు సంబంధించినది. దీనికి మైకా వాల్టర్ నవల ఆధారం. డారిల్ యఫ్. జానుక్ నిర్మించిన ఈ చిత్రంలో ప్రసిద్ధ తారాగణం జీన్ సైమన్స్, బెలా డార్వీ, జీనీటియర్నీ, ఎడ్మండ్ పర్డిమ్, విక్టర్ మెచూర్, మైకేల్ వైల్డింగ్ మొదలైనవారున్నారు.

ఫరావోలనాటి ఈజిప్టుకు సంబంధించిన కథ కావడంవల్ల అందుకు తగిన దృశ్యాలు, వేషధారణలతో చక్కని రంగులలో చిత్రం ఆకర్షణీయంగా ఉంది.

ఫరావో రాణీ పుట్టువల్ల రహస్యంగా ఒక దోనెలో నైల్ నదిలో విడిచిపెట్టబడిన రాజకొడుకును ఒక వైద్యుడు పెంచి వైద్యవృత్తి నేర్పుతాడు. అతడు పెద్దవాడై వైద్యవృత్తి అవలంబించి పేదలకు బానిసలకు వైద్యంచేస్తూ ఫరావో మన్ననకు పాత్రుడౌతాడు. అతడూ అతని మిత్రుడూ ఇద్దరూ ఒక వేశ్యవలలో చిక్కుకుంటారు. వేశ్యాలోలుడై సర్వం నష్టపడిన యువకవైద్యుని ప్రవృత్తికి చింతించి పెంచిన తల్లిదండ్రులు విషం తీసుకుని చనిపోగా వారి శరీరాలను పాడవకుండా శాశ్వతంగా కాపాడాలని ప్రయత్నించి మతగురువుల కోపానికి గురైన కొడుకు చిట్టచివరకు మనుష్యుల ఫరావోలు శాశ్వతులు కారనీ, సత్యమొక్కటే శాశ్వతమైనదనీ ప్రచారం చేస్తాడు.

వంచించబడిన కారణంగా అతడు వేశ్యను హత్యచేసి దేశంవిడిచి పారిపోతాడు. విదేశాలలో ధనవంతులకూ రాజులకూ వైద్యంచేస్తూ ధనంఆర్జించి, అక్కడ్నించి ఉపయోగంలోకివచ్చిన ఇనుముతో చేయబడిన కత్తి ★



రాజ్ కపూర్ నిర్మిస్తున్న "శ్రీ 420" సెట్స్‌మీద.

"ఊంఛీహవేలీ" చిత్రంలో భగవాన్, నిరూపరాయ్, యశోధరకట్జూ
వాహినీవారి "బంగారుపాప"లో రామశర్మ, కృష్ణకుమారి, రంగారావు.

# "బంగారుపాప"
## ప్రేక్షకుల అభిప్రాయాలు

మమతలోని మాధుర్యాన్ని, మానవత్వంలోని మహాత్మ్యాన్ని చాటే మనోజ్ఞ చిత్రాన్ని శ్రీ బి. యన్. రెడ్డి అత్యంత శోభావంతముగా సృష్టించారు. సంఘంలో వుండే వివిధ మనస్తత్వాలుగల పాత్రలను చిత్రంలో చక్కగా విశదీకరింపజేశారు. కథ మొదటినుండి చివరివరకూ కరుణరసభరితంగా చక్కని పంథాలో నడిచింది.

చిత్రానికి జీవం పోసిన పాత్ర కోటయ్యది. కోటయ్యగా యస్. వి. రంగారావుగారు ఆ పాత్రలోని కాఠిన్యాన్నీ, మానవత్వాన్నీ విశదంగా, విస్పష్టంగా, రకరకాల ఉద్రేకాలను కడు సమర్థతతో అభినయించాడు. అతనికి అతడే సాటి. మనోహర్ గా జగ్గయ్య గంభీరమైన నటనా సామర్థ్యాన్ని ప్రదర్శించాడు. పాపగా కృష్ణకుమారి తన నటనా కౌశలమును అత్యద్భుతంగా వెల్లడిచేసింది. శేఖర్ గా రామశర్మకూడా అత్యుత్తమంగా నటించాడు. జమున, విద్యావతి, కాంతన్ మొదలైనవారంతా వారి వారి పాత్రలను బాగా అవగాహనం చేసుకుని సమర్థతతో నిర్వహించారు.

ఈ చిత్రంలోని ప్రతి సన్నివేశమూ ప్రేక్షకుల హృదయ సరోవరాన్ని కదిలింపజేస్తుంది. శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి కథా, సంభాషణలూ పాత్రోచితంగానూ, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పాటలు భావగర్భితంగా ముద్దులు మూటగట్టుచున్నవి. సంగీతం చక్కని కర్నాటకబాణీలో వీనులవిందుగా వున్నది. ఛాయాగ్రహణము, శబ్దగ్రహణము నిర్దుష్టంగా వున్నవి. శ్రీ బి. యన్. రెడ్డిగారి దర్శకత్వ ప్రతిభ యీ చిత్రంలో ప్రతి అంగుళాన వెల్లడి అవుతుంది. ఆబాలగోపాలం చూచి

చూసిముస్తఫా తన దేశస్థులకోసం ఒకటి వమ్మికతీసుకువస్తాడు. ఆకత్తిముందు దేశంలో వాడుకలో ఉన్న ఆయుధాలు పనికిరావు. ఫరావో రాజు హింసా ప్రవృత్తికి ప్రతికూలుడైనందువల్ల ఆ కత్తుల తయారీకి అంగీకరించడు. యువక వైద్యుని మిత్రుడు రహస్యంగా కత్తులు తయారుచేసి దేశంలో బలవంతుడై రాజుకు విషమిచ్చి చంపి తాను రాజౌతాడు. ఈ రహస్యాన్ని బైటపెట్టినందుకు వైద్యుని దేశంనుంచి బహిష్కరిస్తాడు.

ఈజిప్టులో తీసిన కొన్ని షాట్సు ఈ చిత్రానికి అలంకారప్రాయంగా ఉన్నాయి. ★

## "యాస్మిన్"

మ్యూజికల్ పిక్చర్స్‌వారి "యాస్మిన్" చిత్రం ఈ నెల 1వ తేదీన మద్రాస్, స్టార్ టాకీస్‌లో విడుదల అయింది. నిర్మాత, దర్శకుడు ఎ. ఆర్. కర్దార్. సంగీత దర్శకుడు సి. రామచంద్ర, నటీనటులు వైజయంతీమాల, సురేష్ మున్నగువారు. అరేబియన్ వాతావరణంలోని కథ. వైజయంతీమాల ఒక నర్తకిగానూ, సురేష్ ఆమెను ప్రేమించిన యువకుడుగానూ నటించారు. వీరు ప్రేమించుకోవడం ఆమె తండ్రికిగాని, అతని తండ్రికిగాని ఇష్టం ఉండదు. అందుచేత అనేక అవరోధాలు వస్తాయి. కాని సాహసికుడైన ఆ యువకుడు తన ప్రతికక్షుల నందరినీ జయించి ఆమెను చివరికి పొందుతాడు.

వైజయంతీమాల నాట్యాలు, తలత్, లతా మంగేష్కర్‌ల ప్లేబాక్ పాటలు బాగున్నాయి. ద్వారకా దివేచా ఫొటోగ్రఫీ చాలా బాగున్నది. ★



"ఆజాద్"లో 441గా ఓంప్రకాష్.

నాట్యరాణులు లలిత, రాగిణి, పద్మిని



## "బంగారు పాప"



ఆనందింపజేసిన అద్వితీయ కళాఖండం "బంగారు పాప."

కె. వి. జి. కృష్ణమూర్తి

—గుంటూరు.

* * *

సాహినీవారి "బంగారు పాప" చిత్రము చక్కగా నున్నది. మనోహర్ గా జగ్గయ్య, కోటయ్యగా రంగారావు, పాపగా కృష్ణకుమారి, చక్కగా రాణించారు. సుశీల, రాజాగార్ల పాటలు బాగున్నవి. కొండారెడ్డిగారి ఫొటోగ్రఫీ, అద్దేపల్లి రామారావు గారి సంగీతము, ఆహ్లాదకరముగా నున్నవి. రామదాసు (రమణారెడ్డి) మాటలు బాగున్నవి. దర్శకత్వము బాగున్నది. తమ చిత్రములలో క్రొత్తవారిని పైకి తెచ్చుచున్న బి. ఎన్. రెడ్డిగారికి నా ధన్యవాదములు అర్పించుచున్నాను.

ఈదర వెంకటసుబ్బారెడ్డి,

—లింగంగుంటపాలెం.

చిత్రం సగం వరకూ కథ పటుత్వం చెడకుండా నడిచింది. తరువాత చిత్రాన్ని అనవసరంగా పొడిగించారు. కథ కంతకూ ముఖ్యమైన, మనోహర్ పాప తన కూతురే అని చెప్పే ఘట్టానికి. గాంభీర్యం చేకూర్చలేక, అతి సామాన్య విషయంగా చిత్రించారు.

రౌడీగా, ప్రేమపాత్రుడుగా రంగారావుగారు సమర్థతతో నటించి చిత్రానికి జీవం పోశారు. ఆయన నటనా, సంభాషణలు అతి సహజంగా వున్నాయి. తర్వాత చెప్పుకోదగినది జగ్గయ్యగారి నటన, ఈయన ప్రతి మాటలోను, నడకలోను. గాంభీర్యం, హుందా వుట్టిపడ్డాయి. ఈయన నుంచి భవిష్యత్తు వుందని ఆశించవచ్చు. రామశర్మ, కృష్ణకుమారి కూడా బాగా నటించారు.

ఫొటోగ్రఫీ చాలా బాగుంది. మ్యూజిక్ గురించి చెప్పుకోదగ్గదేమీ లేదు. ఈ చిత్రం విజయం పొందుతుం దనటానికి కారణం రంగారావు, జగ్గయ్యగార్ల నటన, కథ.

బలిజేపల్లి రాజారావ్

—రేలంగి.

Edite, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, , Thambu Chetty St Madras.




రతీమన్మథులు

చిత్రకారుడు : ఆర్. వెంకటరావు